ఆషాఢం. 1881 (జూలై. 1959)
Asadha, 1881 (July, 1959)

మూల్యము : 40 నయాపైసలు
Price : Re. 0.40

# SECOND FIVE YEAR PLAN

*Questions & Answers*—(Telugu)

PUBLISHED BY THE DIRECTOR, PUBLICATIONS DIVISION, DELHI-8
AND PRINTED AT THE AJANTA PRINTERS, SECUNDERABAD.

# రెండవ పంచవర్ష ప్రణాళిక

## ప్రశ్నోత్తరములు




భారత ప్రభుత్వం
సమాచార, రేడియో మంత్రిత్వశాఖ
ప్రచురణ విభాగం

# విషయసూచిక

# ఉపోద్ఘాతము

ఈ పుస్తకములో వివరింపబడిన వివిధ అభివృద్ధి శాఖలకు సంబంధించిన కేటాయింపులు ప్రణాళికకు ఆదిలో ఉద్దేశింపబడిన ఖర్చు (రూ. 4,800 కోట్లు) అంచనాల ఆధారముగా యివ్వబడినాయి. అయితే, ప్రణాళిక అమలు జరిగేకొలదీ మన ఆర్థిక వ్యవస్థలో సంభవించే మార్పులదృష్ట్యా కొన్ని సవరణలను చేయడం అవసరం కావచ్చునని ముందుగానే గుర్తించబడింది.

ఇప్పుడు రెండవ ప్రణాళికలో మూడు సం. లు గడిచాయి. మనదేశ మిప్పుడు విదేశీమారకద్రవ్యమందు తీవ్రమైన కొరతను యెదుర్కొనవలసివస్తున్నది. ఈ కొరతవల్ల ప్రణాళికలోని కొన్ని అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణకు, ముఖ్యంగా విదేశీ యంత్ర సామగ్రి కావలసిన కార్యక్రమాల నిర్వహణకు ఇబ్బంది యేర్పడింది.

ఈ పరిస్థితులను గురించి చర్చించే నిమిత్తం 1958 సం. మే నెలలో జాతీయాభివృద్ధి మండలి సమావేశమై, ప్రణాళికలోని అత్యంత ప్రధానమైన కార్యక్రమాలను—ఉక్కు, బొగ్గు ఉత్పత్తి, రవాణా సౌకర్యాల విస్తరణ, ముఖ్యమైన విద్యుదుత్పత్తి ప్రాజెక్టులు మొదలగునవి,—వ్యవసాయోత్పత్తులను అధికం చేయడానికి ఉద్దేశింపబడిన కార్యక్రమాలను, అదివరకే చాలాభాగం పూర్తియై, చివరి దశలోవున్న కార్యక్రమాలను పూర్తిచేయడానికి శ్రద్ధ వహించాలని

నిశ్చయించింది. ఈ కార్యక్రమాలన్నింటికీ రూ. 4500 కోట్లు ఖర్చు కావచ్చునని అంచనా. ప్రణాళికలో మిగిలిన కార్యక్రమాలను– ఖర్చు దాదాపు రూ. 300 కోట్లు– అదనపు సాధనసంపదలు లభిస్తేనే చేపట్టడం జరుగుతుంది.

ప్రణాళిక మొత్తపు వ్యయములో జరిగిన ఈ సవరణదృష్ట్యా ముఖ్యఅభివృద్ధి రంగముల కేటాయింపులందు కొన్ని మార్పులను చేయవలసివచ్చింది. రూ. 4,500 కోట్లు మొత్తపు వ్యయముగా ఆ యా రంగములకు జరిగిన కేటాయింపులు 17 వ పేజీలో నివ్వబడినాయి.

# 1. సామాన్య విషయాలు

ప్రశ్న : స్థూలముగా చెప్పితే మొదటి, రెండవ ప్రణాళికల మధ్య నున్న వ్యత్యాస మేమి ?

ఉ : 1956 సం. మార్చి నెలతో ముగిసిన మొదటి పంచవర్ష ప్రణాళిక, దేశము యొక్క భావిపురోభివృద్ధికి తగిన పునాదిని వేసింది. అప్పటి సాధనసంపదలు పరిమితమైనందువల్ల ఈ ప్రణాళిక లక్ష్యాలు నిరాడంబరమైనవి. అయినా వున్నంతలోనే, వ్యవసాయం, ఇతర గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలకు, రైల్వేల పునరుద్ధరణకు, నిర్వాసుల పునరావాసకల్పనకు, ఇతర అత్యవసర కార్యక్రమాలకు ఈ ప్రణాళికలో ప్రాముఖ్యమివ్వబడింది.

తొలి ప్రణాళికలో ప్రారంభించబడిన అభివృద్ధికృషి రెండవ ప్రణాళికలోకూడా కొనసాగించబడగలదు. అయితే ఈ ప్రణాళిక మొదటిదానికంటె రెట్టింపుకు పైగా పెద్దది. కాబట్టి అభివృద్ధి యితోధిక వేగంతో కొనసాగగలదు. తొలి ప్రణాళికలో వ్యవసాయం, తదితర గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలకు ప్రాధాన్య మివ్వబడగా, ఈ ప్రణాళికలో పరిశ్రమలు, ఖనిజోత్పత్తి, రవాణా సౌకర్యాల విస్తరణకు విశేష ప్రాధాన్యమివ్వబడింది. ప్రణాళిక వ్యయంలో దాదాపు సగభాగం ఈ రంగములకే కేటాయించబడింది. తొలి ప్రణాళిక జాతీయాదాయములో పదిశాతము పెరుగుదలను లక్షించగా రెండవ

ప్రణాళిక జాతీయాదాయములో 25 శాతము పెరుగుదలను లక్ష్యముగా పెట్టుకొన్నది.

ప్ర: రెండవ ప్రణాళిక లక్ష్యం, దేశములో సోషలిస్టు సామాజిక వ్యవస్థను నెలకొల్పడమేనని చెప్పబడింది. దీనికీ, సంక్షేమ రాజ్య స్థాపనకుగల వ్యత్యాస మేమి ?

ఉ: సర్వులకు సమానావకాశములు, సాంఘిక న్యాయం, జీవనభృతిని సంపాదించుకొనే హక్కుల ప్రాతిపదికపై దేశంలో ఆర్థిక, సామాజిక వ్యవస్థలు నెలకొనాలని మన రాజ్యాంగము నిర్దేశిస్తున్నది. ఈ ఆశయములన్నీ సంక్షేమ రాజ్యభావములో అంతర్భాగములే. అయితే, మన ప్రధానమంత్రి వక్కాణించినట్లు సంక్షేమ రాజ్యమనేది సోషలిస్టు ఆశయాలకే కట్టుబడివుండాలని లేదు. కాబట్టి సోషలిస్టు సామాజిక వ్యవస్థ ఇంతకుమించిన ఉత్తమాశయం. మన మమలుజరిపే ఆర్థిక ప్రణాళికలయొక్క ప్రయోజనం వ్యక్తిగత లాభాలకు గాకుండా సామాజిక శ్రేయస్సుకే ఉపయోగపడాలని మనం కోరుతున్నాము. ఒకప్రక్క ఉత్పత్తిని పెంపొందిస్తూ, వేరొకప్రక్క ఆర్థిక అసమానత్వములను తగ్గింపజేయడమే మన ప్రణాళికల ఆశయం. మనము పెట్టుకొన్న సోషలిస్టు సామాజిక వ్యవస్థ లక్ష్యానికి యివి అనుగుణ్యమైనవే.

ప్ర: రెండవ ప్రణాళికయొక్క ముఖ్య లక్ష్యాలేమిటి ?

ఉ: ముఖ్యలక్ష్యాలివి :

1. జాతీయసంపదను పెంపొందించే నిమిత్తం త్వరితగతిన భారీపరిశ్రమల, ముఖ్యంగా పరిశ్రమల స్థాపన ;

2. దేశంలోని సామాన్యప్రజల జీవనస్థాయిని పెంపొందించే నిమిత్తం జాతీయాదాయములో తగుమాత్రం పెరుగుదలను సాధించుట;

3. బహుళముగా ఉద్యోగావకాశములను కల్పించుట;

4. ఆదాయము, సంపదలందు ప్రస్తుతమున్న వ్యత్యాసాలను తగ్గించుట.

పై లక్ష్యములలో రెండవది, మూడవది మొదటి లక్ష్యము నుండియే ఉద్భవిస్తాయని తెలిసికొనవచ్చును. పరిశ్రమలు అభివృద్ధి గాంచి, వస్తూత్పత్తి పెంపొందేకొలదీ జాతీయాదాయము పెరుగుటతోబాటు బహుళముగా ఉద్యోగావకాశములేర్పడుతాయి. పోతే నాల్గవలక్ష్యం, వస్తూత్పత్తి పెంపొందినందువల్ల కలిగే ప్రయోజనాలు సామాన్యప్రజల జీవనస్థాయిని పెంపొందించడానికి వినియోగపడాలని నిర్దేశిస్తున్నది.

ప్ర: ఆదాయములు, సంపదలందు ప్రస్తుతమున్నవ్యత్యాసాలను తగ్గించడానికి ప్రతిపాదించబడిన చర్యలేమి?

ఉ: దేశసంపద ఏ కొద్దిమందివ్యక్తుల, వర్గాల పరం గాకుండా వుండడానికి ప్రణాళికలో దిగువ ప్రతిపాదనలు చేయబడ్డాయి.

1. దేశపారిశ్రామికాభివృద్ధిలో ప్రభుత్వరంగం ప్రముఖపాత్ర వహించాలి. ఈఆశయాని కనుగుణ్యముగా 1948 సం. పు పారిశ్రామిక తీర్మానము సవరించబడింది.

2. వ్యవసాయోత్పత్తులు, మార్కెటింగు, పరపతి సౌకర్యాలు; చిన్నతరగతి పరిశ్రమల నిర్వహణలో సహకారోద్యమం వ్యాపించి, సుసంఘటితం కావాలని ప్రతిపాదించబడింది.

3. సంపదలపై పన్ను, ఖర్చులపై పన్ను, మరణసుంకము మొదలగుపన్నులు ప్రతిపాదించబడ్డాయి. ఆర్థిక అసమానత్వములను తగ్గించడానికివి కొంతవరకు తోడ్పడగలవు.

4. ప్రయివేటు రంగమునందు ప్రభుత్వపు కంట్రోలు యితోధికంచేయడం, భూస్వామ్యపద్ధతిరద్దు, మ్యానేజింగ్ ఏజన్సీపద్ధతి సంస్కరణ, కంపెనీలచట్టము సవరణ, ఇంపీరియల్ బ్యాంకు జాతీయ కరణ మొదలగు చర్యలద్వారా ఈ ఆశయసాధనకు కృషి జరుగు తున్నది.

1956 సం. జనవరిలో భీమా వ్యాపారము జాతీయం చేయ బడటం ఈ సందర్భమందు తీసికొనబడిన ముఖ్యాచర్యలందొకటి.

ప్ర: మన దేశంలో నిరుద్యోగ సమస్య యెంత విస్తారమైనది ?

ఉ: రెండవ ప్రణాళిక ప్రారంభమగునాటికి మన దేశంలోని నిరుద్యోగుల సంఖ్య 50 లక్షలని అంచనా వేయబడింది. ప్రతియేటా మన కార్మిక బలమందు సరాసరిన 20 లక్షలమేరకు పెరుగుదల ఉంటుందనుకొంటే, రెండవ ప్రణాళిక ముగియునప్పటికి దేశంలోని ఉద్యోగార్థులసంఖ్య 150 లక్షలవరకు ఉండవచ్చును. వీరుగాకుండా వ్యవసాయం, గృహవృత్తులు తదితర రంగములందు సంవత్సరంలో కొంతకాలము మాత్రమే పనిపాటులు గలిగి, మిగతాకాలం ఊరికే వుండేవారి సంఖ్యగూడ మిక్కుటముగానేవున్నది.

ప్ర: గ్రామీణ, పట్టణ ప్రాంతాలందు నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికి ప్రణాళిక పరంగా ప్రభుత్వం తీసుకొంటున్న చర్య లేమిటి ?

ఉ: నీటిపారుదల పనులు, విద్యుచ్ఛక్తి స్థావరముల యేర్పాటు, రోడ్ల నిర్మాణం, బంజరు భూములను సాగుకుతెచ్చుట మొదలగు పనులందూ; ముఖ్యముగా సమాజ వికాస కార్యక్రమముక్రింద చేపట్టబడే అభివృద్ధి కార్యక్రమములందు లక్షల సంఖ్యలో పనివారలు కావలసియుంటారు. గ్రామీణప్రాంతాలందు నిరుద్యోగ, నిర్వ్యాపారత్వములను యివి చాలవరకు తగ్గించగలవు. పోతే, కుటీర పరిశ్రమలు యితర చిన్నతరగతి పరిశ్రమల అభివృద్ధి నిమిత్తం ప్రభుత్వం రెండవ ప్రణాళికలో రు. 200 కోట్లు (మొదటి ప్రణాళికలో వీనికి కేటాయించబడిన మొత్తం రు. 50 కోట్లు మాత్రమే) ప్రత్యేకించింది. ఈ పరిశ్రమలందుకూడా బహుళముగా పనిపాటులు లభించగలవు.

ఇక పట్టణ ప్రాంతాలందు నిరుద్యోగ సమస్య విషయం. ప్రణాళికలో భారీ పరిశ్రమల నిమిత్తం పెద్ద మొత్తమే కేటాయించబడింది. వీనివల్లనేమి, విద్యా, ఆరోగ్య, వైజ్ఞానిక పరిశోధనలు, సాంఘిక సంక్షేమం మొదలగు రంగముల అభివృద్ధికి యితోధికంగా ఖర్చు పెట్టబడనున్నందువల్లనేమి, పట్టణ ప్రాంతాలందు ప్రత్యక్షంగాను, పరోక్షంగానుకూడా పెక్కు ఉద్యోగావకాశములు యేర్పడగలవు. మొత్తముమీద రెండవ ప్రణాళిక కాలంలో చేపట్టబడనున్న క్రొత్త అభివృద్ధి కార్యక్రమాలద్వారా 90-100 లక్షల వరకు ఉద్యోగావకాశము లేర్పడగలవని అంచనా వేయబడింది.

ప్ర: విద్యావంతులందు నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికి జరుగుచున్న కృషియెట్టిది?

ఉ: మొదటి ప్రణాళిక కాలములో వ్యవసాయం, గ్రామీణ పునర్నిర్మాణం మొదలగు కార్యక్రమాలకే విశేష ప్రాధాన్యమివ్వబడి

నందువల్ల విద్యావంతుల నిమిత్తం ఉద్యోగావకాశముల కల్పనకు పరిమితముగానే కృషి జరిగింది. పరిశ్రమలు అభివృద్ధి చెందితేనేగాని యిట్టి అవకాశములు తగినంతగా యేర్పడవు. మొత్తం మీద రెండవ ప్రణాళిక కాలంలో నిరుద్యోగులైన విద్యావంతుల నిమిత్తం 15 లక్షల వరకు ఉద్యోగావకాశములు లభించగలవని అంచనా వేయబడింది. ఇట్టివారికి చిన్న తరగతి పరిశ్రమలందు, సహకార పద్ధతిపై వస్తువుల రవాణా మొదలగు రంగములందు కూడా తగు అవకాశములను కల్పించడానికి కృషి జరుగుతున్నది. కొంతవరకీ సమస్య మన విద్యావిధానమునకు, కాయకష్టముపట్ల యువకుల వైఖరికి ముడిపడి యున్నది.

ప్ర : "ప్రణాళిక మార్పులకు, చేర్పులకు అతీతమైనది కా"దని ప్రణాళికా సమితి నొక్కి వక్కాణించింది. దీని అర్థ మేమిటి ?

ఉ : ప్రణాళికను రూపొందించుటలో సమితి దేశావసరాలను, సాధన సంపదలను స్థూలంగా దృష్టిలోకి తీసికొని, 20-30 సం. లలో మనము సాధించగల అభివృద్ధిలో భాగంగా దీనిని రూపొందించింది. ప్రణాళిక అమలు జరిగే కొలదీ మన ఆర్థిక వ్యవస్థలో సంభవించే మార్పుల దృష్ట్యానేమి, క్రొత్తగా యేర్పడే అవసరాల దృష్ట్యానేమి, ప్రతి సం. జరిగిన కృషి దృష్ట్యా నేమి ప్రణాళికలో కొన్ని సవరణలను, కార్యక్రమాల ప్రాధాన్య క్రమమందు మార్పులను చేయడం అవసరం కావచ్చును. ప్రణాళిక మార్పులకు, చేర్పులకు అతీతమైనది కాదంటేయిదే అర్థం.

ప్ర : ప్రణాళికను "ప్రజల ప్రణాళిక" అని వర్ణించడానికి కారణమేమిటి ?

ఉ: దీనికి మూడు ముఖ్యకారణాలున్నాయి. మొదటిది, సోషలిస్టు సామాజిక వ్యవస్థ తన ప్రధాన లక్ష్యంగా ప్రణాళిక దేశం లోని సామాన్యప్రజల జీవనస్థాయిని సర్వతోముఖంగా పెంపొందించ డానికి ఉద్దేశించబడింది గాబట్టి. ఇక రెండవకారణం, ప్రణాళిక తుది స్వరూపమును పొందడానికి ముందు దేశంలోని ప్రముఖులనేకులు, తమ ప్రతినిధులద్వారా ప్రజలు దీని స్వరూప, స్వభావాలను గురించి కూలంకంషగా చర్చించారు. పోతే మూడవకారణం, ప్రణాళిక నిర్వహణలో ప్రజల సహాయ సహకారములు అవసరం కావడం. ప్రజలు పాల్గొనేందుకు అనువైన కార్యక్రమాలనేకం ప్రణాళికలో చేర్చబడ్డాయి. వీనిలో ముఖ్యమైనవి సమాజ వికాస కార్యక్రమము, స్థానికాభివృద్ధి పనుల పథకము, చిన్న మొత్తాల పొదుపు ఉద్యమము మొదలైనవి.

ప్ర. స్థానికాభివృద్ధి పనుల పథకమంటే యేమిటి ?

ఉ: మన ప్రణాళికలలో అధికభాగం భారీయెత్తు అభివృద్ధి పథకాలకే సంబంధించింది. వీనిలో సామాన్య ప్రజలు పాల్గొనే అవ కాశాలు తక్కువ. ఒక ప్రక్క ప్రణాళికలో ప్రజలుకూడా ఉత్సా హంతో పాల్గొనడానికి, వేరొకప్రక్క మన గ్రామీణ ప్రాంతాలం దున్న అపారమైన అంగబలమును నిర్మాణాత్మకమైన పనులకు వినియోగించడానికి తొలిప్రణాళిక కాలంలో స్థానికాభివృద్ధి పనుల పథకమనేది ప్రారంభించబడింది. రూ. 20 వేల ఖర్చుకు లోపుగా నయ్యే, ప్రజలకు శాశ్వతంగా ఉపయోగపడే పనులన్నీ స్థానికాభి వృద్ధి పనుల పథకము క్రిందికి వస్తాయి. ఈ ఖర్చులో సగభాగమును మాత్రమే ప్రభుత్వం భరిస్తుంది. మిగతా సగము స్థానికప్రజతే

రొక్కరూపేణా నేమి, వస్తురూపేణా నేమి, కాయకష్టము రూపేణా నేమి సమకూర్చవలసి యుంటుంది. గ్రామాలను కలిపే రోడ్ల నిర్మాణం, పాఠశాల, ఆసుపత్రి భవనములను బాగుజేయడం, ఆటస్థలములను నిర్మించడం మొదలగువానిని యిట్టిపనులకు ఉదాహరణగా చెప్ప వచ్చును.

సమాజవికాస కార్యక్రమము యింతవరకు వ్యాపించని ప్రాంతాలందు ఈ పథకమునకు ముఖ్యమైన పాత్ర వున్నది. వికాస కార్యక్రమమును ప్రవేశ పెట్టడానికి ముందు ఆ యా ప్రాంతాలందు స్థానికాభివృద్ధి పనుల పథకమును ప్రవేశపెట్టడం అనేక విధాల ప్రయోజనకరం.

**ప్ర: గ్రామీణ పునర్నిర్మాణంలో ప్రణాళికా సమితి గ్రామపంచాయితీలకు నిర్దేశించిన పాత్ర యెట్టిది?**

ఉ: ప్రణాళిక నిర్వహణలో ప్రజల సహకారమును పూర్తిగా పొందగలందులకై ప్రతిరాష్ట్రము తన అభివృద్ధి ప్రణాళికలను జిల్లా, తాలూకా, గ్రామాభివృద్ధి ప్రణాళికలుగా విభజించడం అవసరమని ప్రణాళికా సమితి సిఫార్సు చేసింది. గ్రామస్థాయిలో అభివృద్ధి ప్రణాళికలను రూపొందించడం; భూసంస్కరణలు, భూములను బాగు చేయుట, స్థానికాభివృద్ధి పనులు, సంక్షేమ కార్యక్రమాలను నిర్వహించడం మొదలగు పనులందు గ్రామ పంచాయితీలకు ప్రముఖమైన పాత్ర వున్నది. నిజానికి గ్రామాభివృద్ధికి ఆధారభూతమైన సంస్థ గ్రామ పంచాయితీయే. గ్రామ పంచాయితీలను పటిష్ఠ మొనర్చడానికి ప్రభుత్వం అనేక విధాల సహాయపడుతున్నది.

ప్ర: ప్రణాళిక జయప్రదం కావడానికి ప్రజల సహకారము లభించుటతోబాటు యింకేమి ముఖ్యం ?

ఉ: ఇతర ముఖ్యావసరాలివి :—

1. ప్రపంచయుద్ధముగానీ, అంతః కల్లోలములుగానీ సంభవించకుండుట ;

2. కేంద్ర, వివిధ రాష్ట్ర ప్రభుత్వాల మధ్య సన్నిహిత సహకారం;

3. ప్రణాళికలో చేర్చబడిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలు సక్రమంగా నిర్వహించబడడానికి సమర్థమైన పరిపాలనాయంత్రాంగం.

ప్ర: అవశ్యం అమలు జరగవలసిన పరిపాలనా సంబంధమైన కర్తవ్యా లేమిటి ?

ఉ: ముఖ్యకర్తవ్యాలివి :—

1. అవినీతిని పూర్తిగా తొలగించుట;

2. పరిపాలన, సాంకేతిక సిబ్బంది శ్రేణులను నిర్మించుట;

3. తర్ఫీదు కార్యక్రమాలను నిర్వహించుట;

4. పనులనిర్వహణ దండుగ సంభవించకుండా త్వరితగతిన కొనసాగించుట;

5. ప్రభుత్వ పరిశ్రమలను సమర్థముగా నిర్వహించుట;

6. వ్యవసాయం, సమాజ వికాసకార్యక్రమం, కుటీర, చిన్న తరగతి పరిశ్రమల నిర్వహణ కవసరమయ్యే ఆర్థిక, సాంకేతిక తదితర సహాయములను సమకూర్చుట;

7. వివిధ అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణలో ప్రజల సహకారమును పొందుట;

8. సహకార రంగమును పటిష్ఠమొనర్చుట.

ప్ర: రెండవ ప్రణాళిక జయప్రదమైతే చాలునా, లేక మరి కొన్ని ప్రణాళికలను చేపట్టవలసియుంటుందా ?

ఉ: అభివృద్ధి అనేదానికి తుదిలేదు; అది నిరంతరముగా కొనసాగవలసిందే. ప్రజల సర్వతోముఖాభివృద్ధి లక్ష్యంగా మనము కొనసాగిస్తున్న ప్రయాణంలో రెండవప్రణాళిక రెండవఘట్టము మాత్రమే. దీనితరువాతకూడా మనము మరికొన్ని ప్రణాళికలను చేపట్టవలసియుంటుంది.

## 2. ఆర్థికాది విషయాలు

ప్ర: ప్రణాళికక్రింద ప్రభుత్వ రంగములో రూ. 4,800 కోట్లు ఖర్చుపెట్టబడనున్నది. ఇది చాలా పెద్దమొత్తము. ఇది యేవిధముగా సేకరింపబడనున్నది?

ఉ: ఈ మొత్తమును దిగువ వివరించబడినప్రకారం సేకరించ తలపెట్టబడింది:-

| | | (రూ. కోట్లలో) |
|---|---|---|
| I దేశీయసాధన సంపదలు. | | |
| (1) వర్తమాన ఆదాయములనుండి మిగుళ్లు— | | 800 |
| (ఎ) ప్రస్తుత పన్నులప్రకారం | 350 | |
| (బి) అదనపు పన్నులద్వారా | 450 | |
| (2) ప్రజలనుండి ఋణాలు. | | 1,200 |
| (ఎ) మార్కెట్ ఋణాలు | 700 | |
| (బి) చిన్న మొత్తాల పొదుపు | 500 | |
| (3) ఇతరబడ్జెటు ఆదాయాలు. | | 400 |
| (ఎ) రైల్వేలనుండి లభించేమొత్తం | 150 | |
| (బి) ప్రావిడెంటు ఫండులు, తదితర డిపాజిట్లు | 250 | |
| II ప్రపంచబ్యాంకు, అమెరికా, సోవియట్ యూనియన్ మొ. దేశాలనుండి సహాయం. | | 800 |
| III లోటు బడ్జెటు పద్ధతి. | | 12,00 |
| IV ఇతర సాధనాలద్వారా భర్తీకావలసినది. | | 400 |
| | మొత్తం | 4,800 |

ప్రణాళికవ్యయపు స్థూల స్వరూపమిది. ఆర్థికపరిస్థితులదృష్ట్యా యిందు కొన్నిమార్పులను చేయడం అవసరం కావచ్చును.

ప్ర: ఈ మొత్తము వివిధ అభివృద్ధిరంగములకు ఏ ప్రకారం విభజించబడింది? తొలి ప్రణాళికలో ఆ యా రంగములకు కేటాయించ బడిన మొత్తమెంత ?

ఉ:

| | (కోట్ల రూపాయలు) | |
|---|---|---|
| | రెండవ ప్రణాళిక | మొదటి ప్రణాళిక |
| 1. వ్యవసాయము, సమాజ వికాస కార్యక్రమము | 568 | 357 |
| 2. నీటిపారుదల, విద్యుచ్ఛక్తి | 913 | 661 |
| 3. గ్రామపరిశ్రమలు, చిన్న తరగతి పరిశ్రమలు | 200 | 30 |
| 4. పెద్దపరిశ్రమలు, ఖనిజముల త్రవ్వకం | 690 | 149 |
| 5. రవాణా, వార్తాసౌకర్యాలు | 1385 | 557 |
| 6. సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు | 945 | 533 |
| 7. ఇతరములు | 99 | 69 |
| మొత్తము | 4,800 | 2,356 |

ప్ర: ప్రణాళిక వ్యయము రూ. 4,500 కోట్లకు తగ్గించబడినది గదా! ఇప్పుడు వివిధ అభివృద్ధిరంగములకు జరిగిన కేటాయింపులెంత?

ఉ: క్రొత్త కేటాయింపులు దిగువ నివ్వబడ్డాయి :

| | (కోట్ల రూ. లలో) |
|---|---|
| 1. వ్యవసాయము, సమాజ వికాస కార్యక్రమము | 510 |
| 2. నీటిపారుదల, విద్యుచ్ఛక్తి | 820 |
| 3. గ్రామపరిశ్రమలు, చిన్నతరగతి పరిశ్రమలు | 160 |
| 4. పెద్దపరిశ్రమలు, ఖనిజముల త్రవ్వకం | 790 |
| 5. రవాణా, వార్తా సౌకర్యాలు | 1340 |
| 6. సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు | 810 |
| 7. ఇతరములు | 70 |
| మొత్తము | 4,500 |

ప్ర : ప్రైవేటు రంగములో ఆశించబడుచున్న పెట్టుబడి వివరాలేమిటి ?

ఉ : రెండవ ప్రణాళిక కాలంలో ప్రయివేటు రంగమునందు రూ. 2400 కోట్లవరకు పెట్టుబడి రావచ్చునని ఆశించబడుచున్నది. ఈ మొత్తము వివిధరంగములకు దిగువ వివరించబడిన ప్రకారము స్థూలముగా విభజించబడింది :

| | (రూ. కోట్లలో) |
|---|---|
| 1. సుసంఘటితమైన పరిశ్రమలు, గనులత్రవ్వకం | 575 |
| 2. తోటలు, విద్యుదుత్పత్తి స్థావరాలు, రైల్వేలు మినహా యితర రవాణా సౌకర్యాలు | 125 |

| | |
|---|---|
| 3. వ్యవసాయము, గ్రామ పరిశ్రమలు, చిన్నరకం పరిశ్రమలు | 300 |
| 4. నిర్మాణం | 1,000 |
| 5. స్టాకులు | 400 |
| మొత్తం | 2,400 |

ప్ర : 'లోటుబడ్జెటు పద్ధతి' అనగా నేమి ?

ఉ : ప్రభుత్వము, తనకు పన్నులరూపేణానేమి, ప్రజలనుండి ఋణముల రూపేణానేమి, డిపాజిట్లు, నిధులరూపేణానేమి, పరిశ్రమలనుండి లాభములరూపేణానేమి లభించే ఆదాయమునుమించి ఖర్చుచేయడం 'లోటుబడ్జెటుపద్ధతి' అని పిలువబడుతుంది. ప్రభుత్వము ఇట్టిలోటులను తనరొక్కపు నిల్వలనుండి రాబట్టుటద్వారాగానీ, రిజర్వుబ్యాంకునుండి ఋణమును తీసికొనుటద్వారాగానీ భర్తీ చేయవచ్చును. ఏవిధంగాచేసినా లోటుబడ్జెటు పద్ధతివల్ల డబ్బు చెలామణి యెక్కువౌతుంది. ఎప్పుడైతే దేశంలో డబ్బుచెలామణీ యెక్కువౌతుందో అప్పుడు వస్తువులకు గిరాకి హెచ్చుతుంది. దీనికితగినట్లుగా వస్తూత్పత్తి జరుగకపోతే ద్రవ్యోల్బణ పరిస్థితులేర్పడి ధరలు పెరుగుతాయి. ఇట్టి పరిస్థితులేర్పడకుండా తగుచర్యలను తీసికొనడం అవసరం. అయితే, యింతమాత్రంచేత అసలు లోటుబడ్జెటు పద్ధతే వాంఛనీయంకాదని భావించడం పొరబాటు. కొన్నిపరిమితులకు లోబడి ఈపద్ధతిని అనుసరించడం మేలే. అభివృద్ధి కార్యక్రమాలకవసరమైన ధనమును సమకూర్చుకొనుటలో యిదొక ముఖ్యపద్ధతిగానున్నది. అభ్యుదయంగాంచిన దేశాలలో చాలాభాగము ఈపద్ధతిని అనుసరించాయి.

ప్ర : ప్రణాళిక నిర్వహణకవసరమైన ధనములో రూ. 1,200 కోట్ల మేరకు లోటుబడ్జెటు పద్ధతిని అనుసరించ తలపెట్టబడింది. ఇది చాలా పెద్దమొత్తము. ఇందుమూలముగా ద్రవ్యోల్బణమేర్పడి, వస్తువుల ధరలు పెరగకుండా అరికట్టడానికి యేవిధమైన చర్యలు తీసికొనబడ నున్నాయి ?

ఉ : లోటు బడ్జెటుపద్ధతి అనుసరించదలచిన రూ. 1,200 కోట్లలో రూ. 200 కోట్లమేరకు మన స్టర్లింగు నిల్వలనుండి రాబట్టుట ద్వారా భర్తీచేయడం జరుగుతుంది. ప్రణాళిక అమలుజరిగేకొలదీ జాతీయాదాయం పెరిగి తద్వారా ప్రజల జీవన ప్రమాణంకూడా పెంపొందుతుంది గాబట్టి కొన్నిపరిమితులకు లోబడి, దేశంలో డబ్బు చెలామణి యెక్కువైనా ఫరవాలేదు.

లోటుబడ్జెటు పద్ధతివల్ల ద్రవ్యోల్బణ పరిస్థితులేర్పడకుండా మరికొన్ని జాగ్రత్తలను తీసికొనవలసి యుంటుంది. పరపతిసౌకర్యాలు మితిమీరి విస్తరించకుండా ప్రభుత్వం తగు ఆర్థికవిధానాలను అనుసరించాలనీ; ఆహారధాన్యములు, వస్త్రములు, తదితర నిత్యజీవితావసర వస్తువులను యితోధికంగా వుత్పత్తిచేసి నిలువచేయాలనీ ప్రణాళికలో సూచించబడింది. నిత్యజీవితావసర వస్తువులధరలు పెరగకుండా వుండటానికిది యెంతైనా అవసరం. అవసరమైతే కంట్రోళ్ళు, రేషనింగుకూడా ప్రవేశపెట్టబడవచ్చునని; అధికలాభాలను అరికట్టడానికి తగు పన్నులను విధించవలెననికూడా సూచించబడింది. లోటు బడ్జెటు పద్ధతి దుష్ఫలితాలను యివి కొంతవరకు అరికట్టగలవు.

ప్ర: ప్రణాళిక నిర్వహణకవసరమైన సాధన సంపదలను సమకూర్చుటలో సామాన్య ప్రజలు యేవిధంగా సహాయపడగలరు ?

ఉ: తాము నిల్వచేసిన మొత్తములను ప్రభుత్వానికి ఋణముగా నిచ్చుటద్వారా సామాన్య ప్రజలు ప్రణాళిక సాఫల్యానికి సహాయపడవచ్చును. బ్యాంకింగు వ్యాపారము తగినంతగా వృద్ధి పొందని మన దేశంలో చిన్న మొత్తాల పొదుపు ఉద్యమమునకు ప్రత్యేక ప్రాముఖ్యమున్నది. రెండవ ప్రణాళిక కాలములో ఈ ఉద్యమము ద్వారా రూ. 500 కోట్లు సేకరించాలని తలపెట్టబడింది. మొదటి ప్రణాళిక కాలంలోనైతే ఈ ఉద్యమంద్వారా రూ. 237 కోట్లు వసూలైంది. చిన్న మొత్తాల పొదుపు ఉద్యమమును కేవలం ధనమును సేకరించటానికే ఉద్దేశించబడినదిగా భావించకూడదు. సామాన్య ప్రజలలో పొదుపరితనమును ప్రోత్సహించడానికి, ప్రణాళికకు ప్రజలను మరింత సన్నిహితులను చేయడానికి ఈ ఉద్యమం యెంతైనా తోడ్పడగలదు. ఇచ్చట మరొక ముఖ్య విషయమును గురించిగూడా చెప్పవలసియున్నది. పన్నులద్వారానేమి, ఋణముల ద్వారానేమి, ప్రజలనుండి యెంత యెక్కువగా ధనము సేకరించబడితే అంత మేరకు లోటు బడ్జెటు పద్ధతిని తగ్గించ వీలౌతుంది.

ప్ర: ప్రణాళికలో చేర్చబడిన భారీయెత్తు పారిశ్రామికాభివృద్ధి కార్యక్రమంవల్ల మన విదేశీ మారక ద్రవ్యపు నిల్వలందు తీవ్రమైన కొరత యేర్పడుతుందిగదా! ఈ కొరతను యేవిధంగా భర్తీచేయ తలపెట్టబడింది?

ఉ: పరిశ్రమల అభివృద్ధికవసరమైన యంత్ర సామగ్రినీ ముడివస్తువులను విదేశాలనుండి దిగుమతి చేసికొనవలసిన ఫలితముగా ప్రణాళిక మొత్తముమీద రూ. 1,100 కోట్ల మేరకు మన వ్యాపారశేషమందు కొరత యేర్పడగలదని అంచనా వేయబడింది.

స్టర్లింగు నిల్వలనుండి రూ. 200 కోట్ల మేరకు రాబట్టుటద్వారా ఈ కొరతలో కొంతభాగము భర్తీ కాగలదు. పోతే ప్రణాళిక కాలంలో విదేశీ పెట్టుబడి రూ. 100 కోట్లవరకు రావచ్చునని ఆశించ బడుతున్నది. ఈ రెండు పోగా మిగిలిన రూ. 800 కోట్లను మనము విదేశాలనుండి సహాయముగా పొందవలసి యుంటుంది. అమెరికా సాంకేతిక సహకార సంస్థనుండీ, రష్యా నార్వేలనుండి, ప్రపంచ బ్యాంకునుండి, కొలంబో ప్రణాళికనుండి యిదివరకే మంజూరైన సహాయ మొత్తములో యింతవరకు వినియోగించబడనిది రూ. 310 కోట్లవరకు ఉన్నది.

మన విదేశీ మారక ద్రవ్య నిల్వలను పెంపొందించడానికి యెగుమతులను సాధ్యమైనంతవరకు యెక్కువ చేయాలనీ, దిగుమతు లను కనీస స్థాయిలో నుంచాలనీ సంకల్పించబడింది.

ప్ర: విదేశీ సహాయమును స్వీకరించుట వలన మన స్వాతంత్ర్య ప్రతిపత్తికి భంగము కలుగదా ?

ఉ: రాజకీయసంబంధమైన షరతులు లేకుండా వుంటే విదే శాలనుండి సహాయమును పొందుటలో దోషమేమీ లేదు. ప్రపంచ మందలి ప్రతి దేశము యెప్పుడో ఒకప్పుడు విదేశాల సహాయమును పొందినదే. ఎట్టి షరతులు లేకుండా యివ్వబడే సహాయమే తమకు అంగీకారయోగ్యమని భారతప్రభుత్వం స్పష్టం చేసింది.

ప్ర: ఒకవేళ మనము ఆశించినంతగా విదేశీ సహాయము లభిం చకపోతే, ఆ సందర్భంలో యేర్పడే కొరత యే విధంగా భర్తీ చేయ బడుతుంది ?

ఉ: ఆశించిన మేరకు విదేశీ సహాయం లభించకపోతే వస్తు వినిమయమును మరింతగా తగ్గించుకొని, మన విదేశీ మారకద్రవ్యమును కాపాడుకోవలసియుంటుంది. అయితే దీనికి గూడా కొంత పరిమితి వుంది. ప్రతి యేటా ప్రణాళికల క్రింద పెట్టుబడిని నిర్ణయించడంలో మనకెంత విదేశీమారకద్రవ్యము లభించేదీ స్పష్టంగా అంచనా వేయడం అవసరం.

ప్ర: రెండవ ప్రణాళిక ఫలితముగా జాతీయాదాయమునందు యెంత పెరుగుదల సాధించబడగలదు?

ఉ: రెండవ ప్రణాళిక ప్రారంభమైనప్పుడు జాతీయాదాయం రమారమి రూ. 10,800 కోట్లుగా నున్నది. తొలిప్రణాళిక ప్రారంభించబడినప్పటి దానికంటె యిది 18 శాతము యెక్కువ. కాగా, 1960-61 సం. నాటికి మన జాతీయాదాయము దాదాపు రూ. 13,480 కోట్లకు పెంపొందగలదని (రెండవ ప్రణాళిక ప్రారంభమైనప్పటిదానికంటె యిది 25 శాతము యెక్కువ.) ఆశించబడుతున్నది.

ప్ర: ప్రణాళిక క్రింద యింతవరకు జరిగిన ఖర్చు యెంత?

ఉ: రెండవ ప్రణాళిక తొలి సం. 1956-57 లో, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలచే రూ. 635 కోట్లు ఖర్చుపెట్టబడింది. ఈ మొత్తములో రూ. 359 కోట్లు పన్నులు, ఋణములు, చిన్నమొత్తాల పొదుపు, యితర బడ్జెటు సంబంధమైన ఆదాయములనుండి సమకూర్చుకొనబడింది. రూ. 38 కోట్లవరకు విదేశాలనుండి సహాయము రూపేణా లభించింది. మిగతా రూ. 238 కోట్లమేరకు లోటుబడ్జెటు పద్ధతి అనుసరించబడింది.

ప్రణాళిక రెండవ సం. 1947-48 లో నైతే దాదాపు రూ. 861 కోట్లు ఖర్చుపెట్టబడిందని అంచనా. ఈ మొత్తములో రూ. 297 కోట్లవరకు బడ్జెటు సంబంధమైన ఆదాయములద్వారానూ; రూ. 100 కోట్ల వరకు విదేశాలనుండి సహాయము ద్వారానూ సమకూర్చుకొనబడింది. మిగిలిన రూ. 464 కోట్లకు లోటుబడ్జెటు పద్ధతిని అనుసరించడం జరిగింది.

పోతే ప్రణాళిక మూడవ సం. 1958-59 లో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రణాళిక నిమిత్తం రూ. 1,000 కోట్లు ఖర్చు పెట్టాలని సంకల్పించాయి. ఈ మొత్తములో రూ. 448 కోట్లు బడ్జెటు సంబంధమైన ఆదాయముల ద్వారాను; రూ. 325 కోట్లు విదేశాలనుండి సహాయముద్వారాను; మిగిలిన రూ. 227 కోట్లు లోటు-బడ్జెటు పద్ధతి ద్వారాను సమకూర్చుకొన తలపెట్టబడింది.

# 3. వ్యవసాయము

ప్ర: మొదటి ప్రణాళికలో వ్యవసాయాభివృద్ధికి అధిక ప్రాధాన్య మివ్వబడింది. రెండవ ప్రణాళికకాలంలో కూడా ఈ విధంగానే కృషి జరుగనున్నదా?

ఉ: రెండవ ప్రణాళికలో పారిశ్రామికాభివృద్ధి, గనులత్రవ్వకం, రవాణా సౌకర్యాల విస్తరణకు విశేష ప్రాధాన్య మివ్వబడి నప్పటికీ వ్యవసాయాభివృద్ధి విషయం ఉపేక్షించబడలేదు. ప్రణాళికలో దీనికి కూడా ప్రముఖస్థానమే యివ్వబడింది. ముఖ్యంగా ఆహారధాన్యాల ఉత్పత్తిని యితోధికం చేయడం చాలా అవసరం. దేశజనాభా క్రమక్రమంగా పెరుగుతున్నందువల్లనేమి, అతివృష్టి, అనావృష్టులనుండి తట్టుకొనడానికేమి, లోటు బడ్జెటు పద్ధతివల్ల దేశంలో ద్రవ్యోల్బణ పరిస్థితు లేర్పడి నిత్య జీవితావసరవస్తువుల ధరలు పెరగకుండా అరికట్టడానికేమి, వ్యవసాయోత్పత్తులను అధికం చేసి, ధాన్యాదులను నిలువజేయడం యెంతైనా అవసరం.

ఒక ఆహారధాన్యాలనేగాకుండా, పారిశ్రామికాభివృద్ధికవసర మైన వాణిజ్యపంటలనుగూడ యితోధికంగా ఉత్పత్తి చేయవలసి యున్నది.

మొత్తంమీద రెండవ ప్రణాళికలో వ్యవసాయం, సమాజ వికాసము, నీటి పారుదల సౌకర్యాల నిమిత్తం రూ. 949 కోట్లు

కేటాయించబడింది. ప్రణాళిక మొత్తపు వ్యయములో యిది 20 శాతము.

ప్ర: వ్యవసాయోత్పత్తులకు సంబంధించిన ముఖ్యలక్ష్యాలేమిటి?

ఉ: ముఖ్యమైన పంటలకు సంబంధించిన లక్ష్యాలు ఈమధ్యనే సవరించబడ్డాయి. మొదటపెట్టుకొన్న లక్ష్యాలు, సవరించబడినవి దిగువ పట్టికయందివ్వబడ్డాయి :—

| వ్యవసాయోత్పత్తులు | 1955-56లో ఉత్పత్తి (లక్షలటన్నులు) | 1960-61 లక్ష్యము (లక్షలటన్నులు) | అభివృద్ధి శాతము |
|---|---|---|---|
| ఆహారధాన్యాలు | 650 | 810 (750) | 24.7 |
| నూనెవిత్తులు | 55 | 76 (70) | 37 |
| చెఱకు | 58 | 78 (71) | 33.9 |
| ప్రత్తి | 42 (లక్షలబేళ్ళు) | 65 (55) (లక్షలబేళ్లు) | 55.6 |
| జనుము | 40 (లక్షలబేళ్లు) | 55 (50) (లక్షలబేళ్ళు) | 37.5 |

గమనిక :—బ్రాకెట్లలో యివ్వబడిన అంకెలు మొదట పెట్టుకున్న లక్ష్యాలకు సంబంధించినవి.

మొత్తంమీద రెండవ ప్రణాళిక ముగియుసరికి వ్యవసాయోత్పత్తులందు 28 శాతము పెరుగుదల సాధించబడగలదని ఆశించబడుచున్నది.

ప్ర: వ్యవసాయోత్పత్తులను యితోధికం చేయడానికి తీసికొన బడుతున్న చర్యలేమిటి ?

ఉ: తొలి ప్రణాళికలోవలెనే రెండవ ప్రణాళికలోకూడా మరిన్నిభూములకు నీటిపారుదల సౌకర్యమును కల్పించుట; బంజరు భూములను సాగుకు యోగ్యంచేయుట; పచ్చిఎరువు, రసాయనిక ఎరువులు, మేలుజాతి విత్తనాలను విరివిగా వినియోగించుట; సేద్యంలో ఆధునికపద్ధతులను ప్రవేశపెట్టుట మొదలగు విధానాల ద్వారా వ్యవసాయోత్పత్తులను పెంపొందించ కృషి జరుగుతున్నది. సమాజవికాస కార్యక్రమం, సహకారోద్యమము దేశవ్యాప్తమైన కొలదీ వ్యవసాయాభివృద్ధికి సహాయపడగలవు.

ప్ర: వ్యవసాయాభివృద్ధిలో సహకారోద్యమమునకుగల పాత్ర యెట్టిది ?

ఉ: మన గ్రామీణ ఆర్థికవ్యవస్థ సర్వతోముఖాభివృద్ధికి సహకారసూత్రం అత్యంతావశ్యకమని గుర్తించబడింది. వ్యవసాయాభివృద్ధికవసరమైన ఆర్థికసహాయము సమకూర్చి ధాన్యాదులను నిలువ జేయుటకు, లాభదాయకమైన ధరలకు అమ్మిపెట్టుటకు తగు సౌకర్యాలను కల్పించుటతోబాటు వ్యవసాయదారులకవసరమైన ఎరువులు, విత్తనాలను సరసమైనధరలకు సప్లైజేయుటద్వారాకూడా సహకారసంఘాలు అనేకవిధాల సహాయపడుతున్నాయి.

ప్ర: ఇంతవరకు గ్రామీణ ప్రాంతములందు సహకార రంగములో జరిగిన కృషి అంత సంతృప్తికరముగా లేదనియే చెప్పాలి. ఈ ఉద్యమవ్యాప్తికి తీసికొనబడుతున్న చర్యలేమిటి ?

ఉ: ముఖ్యంగా ఆర్థిక, తదితర సాధనసంపదల కొరతవల్లనే యిదివరలో సహకారసంఘాలు సంతృప్తికరంగా పనిచేయజాలక పోయాయి. గ్రామీణ పరపతి సౌకర్యాల సర్వేకమిటీచేసిన సిఫార్సుల ననుసరించి, రిజర్వుబ్యాంకు సహాయముతో సహకారోద్యమమును పునర్వ్యవస్థీకరించడానికి తగుచర్యలు తీసికొనబడుతున్నాయి. సహకారోద్యమంలో ప్రభుత్వమే ప్రధానభాగస్వామిగా వ్యవహరించనున్నది. వ్యవసాయపరపతిసంఘములందు భాగస్వాములుగా నుండి వాని నిర్వహణలో రాష్ట్రప్రభుత్వాలు ప్రముఖపాత్ర వహించగలందులకై దీర్ఘకాలిక ఋణముల నిచ్చే నిమిత్తం రిజర్వుబ్యాంకు జాతీయ వ్యవసాయిక పరపతినిధి అనుదానిని యేర్పాటు చేసింది. త్వరలోనే కేంద్రప్రభుత్వం సహకారోద్యమ వ్యాప్తికి ఒక ప్రత్యేకనిధిని (నేషనల్ కో - ఆపరేటివ్ డెవలప్‌మెంటుఫండ్) యేర్పాటు చేయనున్నది. పరపతి సంఘాలు మినహా మిగతా సహకార సంస్థల పెట్టుబడి వాటా ధనము ఈ నిధినుండియే సమకూర్చబడుతుంది. గిడ్డంగుల నిర్మాణమునకు, సహకారసంఘాల సిబ్బంది జీతాల చెల్లింపుకు, రాష్ట్రాల సహకారశాఖలను పటిష్ఠ మొనర్చడానికి అవసరమైన ధనసహాయం కూడ ఈ నిధినుండియే సమకూర్చబడుతుంది.

సహకారోద్యమ పునర్వ్యవస్థీకరణ పథకము క్రింద ఒకే ప్రాంతమందలి పరపతి సంఘాలు, యితర సహకారసంఘాలతో కలిపి వేయబడాలని నిశ్చయించబడింది. ఈ యేర్పాటువల్ల కర్షకులు తమ కవసరమైన మేలు జాతి విత్తనాలను, ఎరువులను, వ్యవసాయ పరికరాలను కొనడానికి ఋణములను పొందుటతోబాటు, తాము పండించిన ధాన్యమును అదే సంఘముద్వారా సరసమైన ధరలకు అమ్ముకొనే సౌకర్యం యేర్పడుతుంది, మార్కెటింగు సహకార

సంఘాలు, పెద్ద తరగతి పరపతిసంఘాలు ధాన్యాదులను నిలువచేశే నిమిత్తం గిడ్డంగులను నిర్మించగలవు. కేంద్రగిడ్డంగుల కార్పొరేషన్, రాష్ట్రీల కార్పొరేషన్లు గూడ గిడ్డంగులను నిర్మించనున్నవి.

వివిధరకాల సహకార సంఘాల నిర్వహణకవసరమైన సిబ్బందికి తర్ఫీదు నిచ్చేనిమిత్తం ఒక విస్తృతమైన కార్యక్రమం రూపొందించబడింది. రెండవ ప్రణాళికలో సహకారోద్యమ వ్యాప్తికి రూ. 48 కోట్లు ప్రత్యేకించబడింది.

ప్ర: "కీలక గ్రామపథక" మంటే యేమిటి ?

ఉ: ఈ పథకం దేశంలోని పశుసంపద అభివృద్ధికి ఉద్దేశించబడింది. ఒక కీలకగ్రామపు యూనిట్‌లో మూడు సం. ల వయస్సుకు పైబడిన దాదాపు 5,000 ఆవులుగల అయిదారు గ్రామాలుంటాయి. ఈవిధంగా ప్రత్యేకంగా యెన్నికచేయబడిన ప్రాంతాలందు ఈపథకము క్రింద పశూత్పత్తికి తీవ్రమైన కృషి జరుపబడుతుంది. హీనజాతి యెద్దులకు విత్తులు తీయబడుతాయి. అవసరమైనచోట్ల కృత్రిమ పిండోత్పత్తి కేంద్రాలు యేర్పాటు చేయబడతాయి. మేలుజాతి దూడల పెంపకానికి తగు యేర్పాట్లు చేయబడుతాయి. వీలైనచోట్ల మంచిరకపు గడ్డి పెంచబడుతుంది. సహకార పద్ధతిపై పాలు, పెరుగు, వెన్న, నెయ్యి మొదలగు వస్తువులు అమ్మబడుతాయి.

తొలి ప్రణాళిక కాలంలో 574 కీలక గ్రామాలు, 144 కృత్రిమ పిండోత్పత్తి కేంద్రాలు యేర్పాటు చేయబడ్డాయి. రెండవ ప్రణాళిక కాలంలో మొత్తం 1258 కీలక గ్రామాలను, 245 కృత్రిమ పిండోత్పత్తి కేంద్రాలను యేర్పాటు చేయాలని సంకల్పించబడింది. ఈ పథకముక్రింద దాదాపు 22,000 మేలుజాతి యెద్దులు, 10 లక్షల వరకు మేలుజాతి ఆవులు తయారు కాగలవని ఆశించబడుచున్నది.

# 4. భూసంస్కరణలు

ప్ర: మన దేశంలో ప్రవేశ పెట్ట దలచిన భూసంస్కరణ లందలి ముఖ్యాంశము లేమిటి?

ఉ: ఇవి—

1. ప్రభుత్వమునకు, భూమిని దున్నే వారికి మధ్యనుండే దళారీలను రద్దుచేయడం;

2. కౌలు రేట్లను న్యాయమైన స్థాయికి తగ్గించి, కౌలు దారులకు తాము సాగుచేసే భూములను శాశ్వత హక్కులతో పొందే అవకాశమును కల్పించేనిమిత్తం కౌలుదారీ సంస్కరణలను ప్రవేశ పెట్టుట; (భూ స్వాములు సొంత సేద్యం నిమిత్తము కొంత భూమిని వుంచుకొనుటకు అనుమతించబడుతుంది.)

3. కమతములకు గరిష్ఠ పరిమితులను నిర్ణయించుట;

4. చిన్న చిన్న కమతాలను సుసంఘటితం చేయుటద్వారాను, సహకార వ్యవసాయ పద్ధతిని ప్రవేశపెట్టుటద్వారాను వ్యవసాయ రంగమును పునర్వ్యవస్థీకరించుట.

ప్ర: ప్రభుత్వము అనుసరించదలచిన భూమి విధానము ప్రణాళికయొక్క ఆర్థిక, సాంఘిక లక్ష్యాల సాధనకు యెంతవరకు తోడ్పడ గలదు?

ఉ: కౌలుదార్లకు తగు రక్షణను కల్పించి, కౌలురేట్లను తగ్గించుటద్వారా మన భూమివిధానము వ్యవసాయోత్పత్తులను అధికం చేయడానికి, తద్వారా ప్రణాళిక యొక్క ఆర్థికలక్ష్యాల సాధనకు సహాయపడగలదు. భూములపంపిణీ న్యాయమైన, విస్తృతమైన ప్రాతిపదికపై జరగాలని ఈవిధానం నిర్దేశిస్తున్నది. అనగా దేశంలో ప్రస్తుతం ఆదాయములందువున్న అసమానత్వములను తగ్గించి తద్వారా ప్రణాళిక యొక్క సాంఘికలక్ష్యాల సాధనకు యిది కృషి చేస్తుందన్నమాట. పోతే సహకార వ్యవసాయపద్ధతిని ప్రోత్సహించుట ద్వారా వ్యవసాయరంగమును పటిష్ట మొనర్చుటతోబాటు, ఒక క్రొత్త సాంఘికవ్యవస్థకు దోవచూపించగలదు.

ప్ర: ప్రణాళికలో సూచించబడిన కౌలుదారీ సంస్కరణలేమిటి?

ఉ: ఇవి—

1. కౌలుదార్లు చెల్లించవలసిన కౌలురేటు (పంట వాటాలతోసహా) మొత్తము ఉత్పత్తిలో నాలుగు లేక అయిదవవంతుకు మించి వుండకూడదు. రొక్కరూపేణానైతే యిది భూమిశిస్తుకు కొన్నిరెట్లుగా నిర్ణయించబడవచ్చును.

2. కౌలుదార్లకు తగు రక్షణ కల్పించబడాలి. వాస్తవముగా స్వంతసేద్యము నిమిత్తం భూస్వాములు కొంతభూమిని వుంచుకొనవచ్చును. అయితే, దీనివల్ల కౌలుదారునకు భూమి మిగలకపోవడం సంభవించకుండా తగుజాగ్రత్త తీసికొనబడాలి.

3. కౌలుదార్లకు శాశ్వతహక్కులు యివ్వబడిన ప్రాంతాలందు భూస్వాములకు తగిన నష్టపరిహారమిచ్చిన మీదటనే భూములు కౌలుదార్లకప్పగించబడాలి.

ప్ర: చట్టరీత్యా కౌలుదార్లకు రక్షణ కల్పించబడిన రాష్ట్రాలందు కూడా కొన్ని సందర్భములందు భూస్వాములు తమ పలుకుబడి నుప యోగించి కౌలుదార్లు భూములను "ఐచ్ఛికముగా వదలుకొనునట్లు" చేయడం జరుగుతున్నదని తెలియవచ్చింది. ఇట్టి అక్రమాలు జరుగ కుండా తీసికొనబడుతున్న చర్యలేమిటి ?

ఉ: ఈసందర్భంలో రెండు సిఫార్సులు చేయబడ్డాయి.

అవి :

1. ఎవరైనా కౌలుదార్లు భూమిని వదలుకోవడం జరిగితే, రెవిన్యూఅధికారులు తగు దర్యాప్తిజరిపి, యీవదలుకొనడం ఐచ్ఛికంగానే జరిగిందని నమోదుచేయాలి.

2. వదలుకొనబడిన భూమిలో, స్వంతసేద్యము నిమిత్తం చట్టరీత్యా తనకు అనుమతించబడిన భాగమునుమాత్రమే భూస్వామి స్వాధీనము చేసికొనవలసి యుంటుంది. అదనపుభూమి యేమైనా వుంటే, అది ప్రభుత్వానికి అప్పజెప్పబడుతుంది.

ప్ర: కమతాలకు గరిష్ఠ పరిమితి నిర్ణయించబడాలని ప్రణాళికా సమితి ఆశిస్తున్నది. ఈ పరిమితి యేవిధంగా నిర్ణయించ బడుతుంది ?

ఉ: ఈ పరిమితి మూడు కుటుంబ కమతాలకు మించి వుండ కూడదని ప్రణాళికాసమితియే సిఫారసు చేసింది. ఒక కుటుంబ కమత మంటే ఒక నాగలి కమతమనిగాని, లేక వ్యవసాయంలో సాంప్రదాయ సిద్ధమైన సహాయంతో ఒక సామాన్య రైతుకుటుంబము సేద్యం చేయగల భూమి అని గాని నిర్వచించబడింది.

ప్ర: ఈ పరిమితుల నుండి మినహాయించబడే భూములేమైనా సిఫారసు చేయబడినవా ?

ఉ: తేయాకు, కాఫీ, రబ్బరు తోటలు: పంచదార ఫ్యాక్టరీలచే స్వయముగా నిర్వహించబడే చెఱకు తోటలు: అభివృద్ధి నిమిత్తం పెద్దమొత్తాలు పెట్టుబడి పెట్టబడి, సమర్థతతో నిర్వహించబడుతూవున్న వ్యవసాయ క్షేత్రాలు ఈ పరిమితుల నుండి మినహాయించబడినవి.

ప్ర: భూవసతిలేని వ్యవసాయ కార్మికుల జీవన పరిస్థితులను అభివృద్ధి చేయడానికి ప్రణాళికలో సూచించబడిన చర్య లేమిటి?

ఉ: కమతాలకు గరిష్ఠపరిమితిని నిర్దేశించుటవల్ల విడుదలయే భూములు, భూదాన ఉద్యమము ద్వారా లభించే భూములు, సాగుకు యోగ్యం చేయబడిన ప్రభుత్వపు బంజరు భూములు సాధ్యమైనంత వరకు భూవసతి లేని వ్యవసాయ కార్మికులకే పంచిపెట్టబడుతాయి. అయితే, ఈ విధంగా లభించే భూమి మొత్తము పరిమితమైందే గాబట్టి వ్యవసాయ కార్మికుల సమస్య పూర్తిగా పరిష్కారం కాదు. వీరిని, నిర్మాణ కార్యక్రమములందు పాల్గొనే నిమిత్తం కార్మిక సహకారసంఘాలుగా యేర్పరచి, తగు జీవనోపాధిని కల్పించడానికి కృషి జరుగుతున్నది. వీరి నిమిత్తం పెక్కు కుటీరపరిశ్రమలు కూడా నెలకొల్పబడుతున్నాయి. వీరు స్వయంగా ఇండ్లు కట్టుకొనగలందులకై ఉచితముగా స్థలము లివ్వబడాలనీ, వీరికి కూడా కనీస వేతన చట్టము వర్తింపజేయబడాలనీ ప్రణాళికా సమితి నొక్కి వక్కాణించింది.

ప్ర: వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలు సమర్థంగా నిర్వహించబడడానికి దేశమందలి చిన్నచిన్న కమతాలను సుసంఘటితం చేయడం చాలా ముఖ్యం. దీనికి ప్రతిపాదించబడిన చర్యలేమిటి?

ఉ: వివిధ రాష్ట్రాలు, తమ ప్రణాళికలందు భాగముగా చిన్నచిన్న కమతాలను సుసంఘటితంచేసేందుకు ప్రత్యేకంగా కార్యక్రమాలను రూపొందించాయి. ఈ విషయంలో వివిధ ప్రాంతాలందు జరుగుతున్న కృషిని ప్రణాళికా సమితి పరిశీలించి, కొన్ని సలహాల నిచ్చింది.

రాష్ట్రాలు ఈ కార్యక్రమాలను త్వరితగతిన విస్తరింపజేయ గలందులకై కేంద్రప్రభుత్వము వీనికయ్యే నికరపు ఖర్చులో సగభాగ మును భరించ నిశ్చయించింది. ఇది మొత్తపుఖర్చులో 25 శాతము నకు లోబడియుంటుంది.

ప్ర: సహకారవ్యవసాయ పద్ధతి నిమిత్తం సిఫార్సు చేయబడిన కార్యక్రమమేమిటి?

ఉ: వచ్చే పది, పదిహేను సం. లలో దేశమందలి వ్యవసాయ భూమిలో యెక్కువభాగం సహకార పద్ధతిపై సాగుచేయబడాలని సిఫారసు చేయబడింది.

ప్ర: దేశంలో సహకార వ్యవసాయ పద్ధతిని వ్యాప్తిచేయడానికి తలపెట్టబడిన చర్యలేమిటి?

ఉ: దేశంలో విరివిగా సహకార వ్యవసాయ సంఘాలు యేర్పాటుచేయబడాలనీ, వానికి ప్రభుత్వం దిగువ సౌకర్యాలను సమకూర్చాలనీ ప్రణాళికా సమితి సూచించింది.

1. ప్రభుత్వమునుండి గానీ, సహకార సంస్థలనుండి గానీ ఋణమును పొందే యేర్పాటు (ప్రభుత్వ ఆమోదమును పొందిన వ్యవసాయ ప్రాజెక్టులకు ప్రాధాన్యం యివ్వబడుతుంది.)

2. మేలుజాతి విత్తనాలు, ఎరువులు తదితర వస్తువులసప్లై;

3. వ్యవసాయ క్షేత్రములందలి భూములను సుసంఘటితం చేసేందుకు సౌకర్యాలు;

4. ప్రభుత్వముచే సాగుకు యోగ్యముచేయబడినభూములందు యితర సాగుచేయదగిన భూములందు వ్యవసాయ కార్మికులకు పునరావాసకల్పన;

5. సహకార వ్యవసాయ క్షేత్రాల నిర్వహణాధికారి జీతమునకు కొంతకాలంపాటు సబ్సిడీ యివ్వడం ;

6. ఉత్పత్తిసెక్కువచేయడానికి, ధాన్యాదుల అమ్మకం, ప్రొసెసింగ్ మొదలగువానికవసరమైన సాంకేతిక సహాయమును సమకూర్చుట;

7. సహకార వ్యవసాయక్షేత్రపు సభ్యులెవరైనా కుటీర పరిశ్రమలు, పాడిపరిశ్రమ, తోటపని మొదలగు వ్యవసాయేతర పనులను చేపట్టితే వారికి అవసరమైన ఆర్థిక, సాంకేతిక సహాయముల నిచ్చుట.

కమతములకు గరిష్ఠపరిమితిని నిర్దేశించుటవల్ల విడుదలయ్యే భూములు వీలైనచోట్ల సహకార వ్యవసాయ సంఘాలకు అప్పగించబడాలని ప్రణాళికా సమితి సూచించింది. సహకార వ్యవసాయ నిర్వహణలో మెరైన పద్ధతులను రూపొందించే నిమిత్తం ప్రతిజిల్లాలోను ప్రయోగాత్మకంగా ఒకటి రెండు వ్యవసాయ క్షేత్రాలను యేర్పాటు చేయాలని, తరువాత ప్రతి వికాస కార్యక్రమ బ్లాకులో యిట్టివానిని యేర్పాటు చేయాలనికూడా సిఫార్సు చేయబడింది. ఇవి సహకార సేవకులకు తర్ఫీదు కేంద్రాలుగా ఉపయోగపడగలవు.

ప్ర : భూసంస్కరణల నిర్వహణలో భూదానోద్యమునకు గల ప్రాముఖ్యమెట్టిది ?

ఉ : భూసంస్కరణలను జయప్రదంగా అమలు జరపడానికి అవసరమైన పరిస్థితులను కల్పించుట ద్వారా భూదానోద్యమం సహాయపడుతుంది. ఈ ఉద్యమం ద్వారా లభించే భూములను భూవసతిలేని వ్యవసాయ కార్మికులకు పునరావాస సౌకర్యాలను కల్పించే నిమిత్తం వినియోగించవచ్చును.

# 5. నీటిపారుదల, విద్యుచ్ఛక్తి

ప్ర: నీటిపారుదల సౌకర్యాల కల్పనకు ఒక జాతీయ కార్య క్రమమును రూపొందించడం యెందుకు అవసరం?

ఉ: ప్రణాళికలో వ్యవసాయోత్పత్తుల విషయమై మనము పెట్టుకొన్న లక్ష్యములను పూర్తిగా సాధించడానికి విస్తృతమైన నీటిపారుదల కార్యక్రమం యెంతైనా అవసరం. దేశంలో పెక్కు ప్రాంతాలందు పంటలు పండడానికి తగినంతగా వర్షపాతంలేదు. ఈ కొద్దిపాటి వర్షమైనా సంవత్సరంలో యే రెండుమూడు నెలలందో పడుతుంది. పంటలకవసరమైనపుడల్లా నీరులభించడానికి కేవలం వర్షాలపై ఆధారపడితే ప్రయోజనంలేదు; నీటిపారుదల సౌకర్యాలు కూడా వుండాలి. మన నదులందలి నీటిలో అత్యధికభాగం—నూటికి 90 పాళ్ళవరకు—సముద్రాలపాలౌతున్నది. ఈవిధంగా వృధాగా పోతున్న అమూల్యమైన నీటిని సద్వినియోగంచేయడానికి యావద్దేశా నికి ప్రయోజనం చేకూర్చగల జాతీయ నీటిపారుదల కార్యక్రమమును రూపొందించడం యెంతైనాఅవసరం.

ప్ర: రెండవ ప్రణాళికకాలంలో పెద్దతరగతి, చిన్నతరగతి నీటిపారుదల పథకములద్వారా యెంతభూమికి నీటిపారుదల సౌకర్యం లభించగలదు?

ఉ : తొలిప్రణాళిక రూపొందించబడినప్పుడు, అప్పటినుండి 15 - 20 సం॥ల లోగా దేశంలో నీటిపారుదల సౌకర్యంగలభూమి రెట్టింపు కావాలని (10 కోట్ల ఎకరములకు పెంపొందాలని) లక్ష్యంగా పెట్టుకొనబడింది. మొదటి 5 సం.లలో అదనముగా 1.4 కోట్ల ఎకరములకు నీటిపారుదలసౌకర్యం కల్పించబడింది. ఇందు దాదాపు 40 లక్షల ఎకరములకు పెద్దతరగతి, మధ్యతరగతి పథకములద్వారా నీటిపారుదల సౌకర్యమును కల్పించడం జరిగింది.

ఇక రెండవ ప్రణాళిక కాలంలోనైతే మరి 2.1 కోట్ల యెకరములకు (ఇందు 1.2 కోట్ల యెకరములు పెద్దతరగతి పథకములకు సంబంధించినది.) నీటిపారుదల సౌకర్యము కల్పించాలని తలపెట్టబడింది. ఈ ప్రణాళిక ముగియునప్పటికి దేశమందలిసాగుభూమి మొత్తములో 27 శాతమునకు సంపూర్ణమైన నీటిపారుదలసౌకర్యం వుండగలదని ఆశించబడుచున్నది.

ప్ర : పారిశ్రామికాభివృద్ధికి విద్యుచ్ఛక్తి అత్యంతావశ్యకం. రెండవ ప్రణాళికలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి పెట్టుకున్న లక్ష్యము లేమిటి ?

ఉ : తొలిప్రణాళిక ముగియునప్పటికి దేశమందలి విద్యుచ్ఛక్తి స్థావరాల ఉత్పాదకశక్తి 34 లక్షల కిలోవాట్లుగానున్నది. ఇది ప్రణాళిక ప్రారంభమైన దానికంటె 48 శాతము యెక్కువ.

రెండవ ప్రణాళిక కాలంలో ప్రభుత్వ, ప్రయివేటు రంగము లందు కలిపి అదనముగా 35 లక్షల కిలోవాట్ల మేరకు విద్యుత్పాదక. శక్తిని పెంపొందించాలని లక్ష్యంగా పెట్టుకొనబడింది.

ప్ర : ప్రస్తుతము నిర్మాణమందున్న ముఖ్యనీటి పారుదల, విద్యుదుత్పత్తి ప్రాజెక్టులేమిటి ?

ఉ : ముఖ్యమైన వానిజాబితా దిగువ నివ్వబడింది.

భక్రా-నంగల్ (పంజాబు, రాజస్థాన్)
దామోదరలోయ ప్రాజెక్టు (ప. బెంగాలు, బీహారు)
హీరాకుద్ (ఒరిస్సా)
మహానదీ డెల్టా ప్రాజెక్టు (ఒరిస్సా)
కాక్రపార్ (బొంబాయి)
మయూరాక్షి (ప. బెంగాలు)
కోసి (బీహారు, నేపాలు)
చంబల్ (రాజస్థాన్, మధ్య ప్రదేశ్)
తుంగభద్ర (ఆంధ్ర, మైసూరు)
నాగార్జునసాగర్ (ఆంధ్ర)
ఘటప్రభ (మైసూరు)
రిహాండ్ (ఉత్తర ప్రదేశ్)
ముచకుంద్ (ఆంధ్ర, ఒరిస్సా)
పెరియారు (మద్రాసు)
మలంపుజా (కేరళ)
కొయినా (బొంబాయి)
భద్ర (మైసూరు)

ప్ర : పైవి గాకుండా క్రొత్తగా చేపట్టబడిన ప్రాజెక్టులేమిటి ? వీనికయ్యే ఖర్చు యెంత ?

ఉ: రెండవ ప్రణాళికలో దాదాపు 200 వరకు నీటి పారుదల ప్రాజెక్టులు చేర్చబడినాయి. వీనిలో రూ. 5 కోట్లకుమించి ఖర్చయేవి 18 మాత్రమే. ఈ విధంగా సత్వర ఫలితాలనివ్వగల చిన్న తరగతి నీటి పారుదల ప్రాజెక్టులకే ప్రణాళికలో ప్రాముఖ్య మివ్వబడింది. ఇదేవిధంగా ప్రణాళికలో చేర్చబడిన 44 క్రొత్త విద్యుదుత్పత్తి పథకములందుకూడ అధికభాగం సత్వర ఫలితాలనివ్వగలిగేవే. వీని ద్వారా ప్రణాళిక కాలంలోనే 11 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుందని అంచనా. ఈ ప్రణాళిక కాలంలో చేపట్టబడిన క్రొత్త ప్రాజెక్టులందు ముఖ్యమైనవి కొన్ని దిగువ నివ్వబడినాయి.

గిర్నా (బొంబాయి)
ఉకాయ్ (బొంబాయి)
నర్మదా (బొంబాయి)
పూర్ణా (బొంబాయి)
వనాస్ (బొంబాయి)
మూల (బొంబాయి)
శార్దాసాగర్ రెండవ దశ (ఉత్తర ప్రదేశ్)
రామగంగ (ఉత్తరప్రదేశ్)
తావా (మధ్యప్రదేశ్)
రాజస్థాన్ కాల్వ పథకము (రాజస్థాన్)
కాంగ్సాబాతి (ప. బెంగాలు)
దుర్గాపూర్ థర్మల్ స్కీము (ప. బెంగాల్, బీహారు)
కోర్బా హైడ్రో-ఎలక్ట్రిక్ స్కీమ్ (మధ్యప్రదేశ్)
కుందా హైడ్రో-ఎలక్ట్రిక్ స్కీమ్ (మద్రాసు)
శరావతి హైడ్రో-ఎలక్ట్రిక్ స్కీమ్ (మైసూరు)

బరౌనీస్టీమ్ స్టేషన్ (బీహారు)
యమునా హైడల్ స్కీమ్ (ఉత్తరప్రదేశ్)

క్రొత్త నీటిపారుదల ప్రాజెక్టులకు మొత్తం రూ. 450 కోట్ల వరకు ఖర్చు అవుతుందని అంచనా. ఈ మొత్తములో సగంవరకు 1960—'61 సం. నాటికే ఖర్చుపెట్ట బడగలదు. పోతే పైన వివరించబడిన క్రొత్తవిద్యుదుత్పత్తి ప్రాజెక్టులకైతే మొత్తము రు. 420 కోట్లవరకు ఖర్చుఅవుతుందని అంచనా వేయబడింది. ఈ మొత్తంలో రూ. 267 కోట్లు ప్రణాళిక ముగియులోపలే ఖర్చుపెట్టబడ నున్నది.

ప్ర: నీటిపారుదల సౌకర్యాల కల్పనలో చిన్నతరగతి నీటి వనరులకుగల పాత్రయెట్టిది?

ఉ: చిన్నతరగతి నీటివనరులలో బావులు, చెఱువులు, కాల్వలు, గొట్టపుబావులు మొదలగునవి చేరివున్నాయి. ఇటీవలి సంవత్సరాలలో గొట్టపు బావుల ద్వారా సేద్యపు నీటి సౌకర్యాల కల్పన బాగా వ్యాప్తికి వచ్చింది. రెండవ ప్రణాళిక కాలంలో దాదాపు 20 కోట్ల ఖర్చుతో 3,600 గొట్టపుబావులు యేర్పాటు చేయబడనున్నాయి. మొత్తంమీద ప్రణాళికలో చిన్నతరగతి నీటి వనరులద్వారా అదనముగా 90 లక్షల ఎకరములకు సేద్యపు నీటి సౌకర్యం లభించగలదని ఆశించబడుతున్నది. పెద్ద, మధ్యతరగతి ప్రాజెక్టుల ద్వారా నైతే 120 లక్షల ఎకరములకు ఈ సౌకర్యం లభించగలదని అంచనా.

ప్ర: చిన్నతరగతి నీటివనరులకంటే పెద్దతరగతి ప్రాజెక్టులను నిర్మించడమే మేలుకాదా?

ఉ; సమగ్రమైన నీటిపారుదల సౌకర్యాల కల్పనకు ఈ రెండూ అవసరమే. ఈ రెంటికీ ప్రత్యేకమైన అనుకూలతలున్నాయి. పెద్దపెద్ద ప్రాజెక్టులైతే వృథాగా సముద్రాల పాలౌతున్న నదీ జలములను సద్వినియోగంచేసి వేలకొలది యెకరములకు నీటిపారుదల సౌకర్యమును కల్పించగలవు. ఇవి సామాన్యంగా బహుళార్థసాధక ప్రాజెక్టులై (పెక్కు ప్రయోజనాల నివ్వగలవి) యుంటాయి. వీనివల్ల భూములకు సేద్యపు నీటిసౌకర్యమును కల్పించుటతోపాటు విద్యుచ్ఛక్తినికూడా విరివిగా ఉత్పత్తిచేసి, వరదలను అరికట్టవచ్చును.

చిన్నతరగతి నీటిపారుదల పథకములనైతే తక్కువఖర్చుతో స్వల్పకాలంలోనే పూర్తిచేయవచ్చును. వీని నిర్మాణంలో స్థానికప్రజల సహకారమును పొందడం సులభం. ఇవి సత్వరఫలితాల నివ్వగలవు. పెద్ద పెద్ద ప్రాజెక్టులను నిర్మించ సాధ్యంగాని ప్రాంతాలందు సేద్యపు నీటి సౌకర్యాల కల్పనకు యివి యెంతైనా తోడ్పడ గలవు.

మన దేశంలో ఈ రెంటికీ అవకాశాలున్నాయి. ప్రణాళికలో కూడా ఈ రెంటికీ తగిన ప్రాముఖ్య మివ్వబడింది.

ప్ర: మన గ్రామసీమల అభివృద్ధికి విద్యుచ్ఛక్తి యెంతైనా అవసరం. గ్రామీణ ప్రాంతాలందు విద్యుద్దీప సౌకర్యాల కల్పనకు ప్రణాళిక క్రింద జరుగుతున్న కృషి యెట్టిది?

ఉ; మన గ్రామసీమలు ఒక చోటగా కాకుండా దేశమంతా వ్యాపించి వున్నాయి. వీనిలో అధికభాగం విద్యుదుత్పత్తి కేంద్రాలకు దూరంగానే వున్నందువల్ల వీటన్నింటికీ విద్యుద్దీపసౌకర్యమును కల్పించడం అపారమైన ఖర్చుతోకూడుకున్న పని. కాబట్టి యీ కార్యక్రమమును దశల వారీగానే అమలు జరుపవలసియుంటుంది.

ప్రణాళికలో చిన్న చిన్న పట్టణాలు, గ్రామాలకు విద్యు ద్దీప సౌకర్యమును కల్పించే నిమిత్తం రూ. 75 కోట్లు ప్రత్యేకించబడింది. ఈ మొత్తముతో 10,000 కు మించి జనాభాగల చిన్నపట్టణములు, గ్రామములన్నింటికినీ ; 5,000 నుండి 10,000 వరకు జనాభా గల గ్రామములలో 80-90 శాతము వరకును విద్యుద్దీప సౌకర్యము లభించగలదు. ఈ సౌకర్యముగల పట్టణాలేమి, గ్రామాలేమి పరిసర గ్రామాలకు కేంద్రములుగానుంటూ, వాని అభివృద్ధికి దోహదము నివ్వగలవు.

5000 లకు లోపు జనాభాగల గ్రామాలలోకూడా "మెయిన్ గ్రిడ్" లైనులకు సమీపమునున్న వానికి విద్యుద్దీప సౌకర్యము నివ్వ డానికి కృషి జరుగుతుంది. ఈవిధంగా 5000 లకు లోపు జనాభాగల గ్రామాలలో 8600 గ్రామాలవరకూ విద్యుద్దీప సౌకర్యము లభించ గలదని ఆశించబడుతున్నది. ప్రణాళిక ముగియునప్పటికి దేశంలో 18,000 గ్రామాలకు, పట్టణాలకు విద్యుద్దీపసౌకర్యం లభించగలదు.

**ప్ర : దేశంలో పెక్కు ప్రాంతాలందు వరదలవల్ల ప్రతియేటా అధికంగా కష్టనష్టములు సంభవిస్తున్నాయి. వీని నివారణకు జరుగుతున్న కృషి యెట్టిది ?**

ఉ: తగినంతగా వివరాలు లభించనందువల్ల వరదలనివారణకు విస్తృతమైన పథకములను రూపొందించుటకు యింతవరకు సాధ్యం కాలేదు. ఈకృషి దశలవారీగా జరుగవలెనని నిర్ణయించబడింది.

ప్రణాళికలో వరదల నివారణ నిమిత్తం రూ. 60 కోట్లు ప్రత్యేకించబడింది. భూసారరక్షణ, నదుల ఎగువ ప్రాంతములందు అడవులను వేయడంవల్లకూడా వరదలను కొంతవరకు అరికట్టవచ్చుననీ

కనుగొనబడింది. ప్రజాళికకు సంబంధించిన వ్యవసాయాభివృద్ధి కార్య క్రమంలో ఈ రెంటికీ తగు కేటాయింపు జరిగింది.

ప్ర : నీటిపారుదల, విద్యుదుత్పత్తి ప్రాజెక్టుల జయప్రద నిర్వహణకు ప్రజలేవిధంగా సహాయపడగలరు ?

ఉ : ప్రజలు దిగువవివరించబడిన విధాల సహాయపడవచ్చును :

1. పెద్దప్రాజెక్టుల నిర్మాణమునకు ఋణములనిచ్చి ;

2. అభివృద్ధిపన్ను, నీటితీరువల చెల్లింపునకంగీకరించి ;

3. కాల్వలత్రవ్వకం, రోడ్లనిర్మాణం, వరదకట్టలనిర్మాణం మొదలగుపనుల నిర్వహణకు సహకారసంఘములనేర్పరచి ;

4. ప్రభుత్వ నీటివనరులనుండి లభించేనీటిని పొదుపుగా సద్వినియోగంచేసి;

5. ప్రైవేటు నీటివనరులను సమర్థతతో నిర్వహించి, ప్రజలు సహాయపడవచ్చును.

# 9. సమాజ వికాస కార్యక్రమము

ప్ర : సమాజ వికాస ఉద్యమమంటే యేమిటి?

ఉ : గ్రామీణప్రజలు స్వయంకృషిద్వారా తమఆర్థిక, సాంఘిక జీవనపరిస్థితులను సర్వతోముఖంగా అభివృద్ధి చేసికొనడానికి ప్రారంభించబడిన ఉద్యమమే సమాజవికాసోద్యమమని వ్యవహరించబడుతున్నది. తమజీవన పరిస్థితులను పెంపొందించుకోవాలనే ఆకాంక్ష ప్రజలలో కలిగించడం ఈ ఉద్యమముయొక్క ప్రధానాశయమై వున్నది. దీనికి అధికారులద్వారా గాకుండా, గ్రామీణులనడుమ నివసిస్తూ వారి ఆదరాభిమానములను చూరగొనగలిగే వ్యక్తులద్వారానే కృషి జరుగుతున్నది. వీరే గ్రామసేవకులు. వీరికి గ్రామీణ జీవితమునకు సంబంధించిన సమస్తవిషయములతో చక్కని పరిచయం వుంటుంది. వివిధ అభివృద్ధిపనుల నిర్వహణలో వీరికి రాష్ట్రఅభివృద్ధి శాఖలు సహాయపడుతాయి. గ్రామీణ ప్రజలసమస్యలను పరిష్కరించుటలోను, తద్వారా గ్రామీణజీవితమును అభివృద్ధి చేయుటలోను వీరు ప్రజలతో కలసిమెలసి కృషిచేస్తారు.

ప్ర : సమాజ వికాస కార్యక్రమమందలి ముఖ్యాంశములేమిటి?

ఉ : గ్రామీణ జీవితమునకు ప్రధాన జీవనాధారములైన వ్యవసాయం, పశుపోషణ ఈ కార్యక్రమమందలి ముఖ్యాంశ

ముత్తై యున్నవి. అయితే ప్రజారోగ్యం, విద్య, గృహవసతి, రవాణా సౌకర్యాల విస్తరణకుకూడా తగు ప్రాముఖ్యమివ్వబడింది. రెండవ ప్రణాళికలో ఈ కార్యక్రమం క్రింద కుటీరపరిశ్రమల అభివృద్ధి, సహకారసంఘాల స్థాపన, స్త్రీ జనసంక్షేమం, బాలబాలికల సంక్షేమం, ఆదిమజాతిప్రాంతాల అభివృద్ధి మొదలగువాని విషయమై ప్రత్యేకంగా కృషి జరుపబడనున్నది.

ఈ కార్యక్రమం క్రింద అభివృద్ధి నిమిత్తం డెవలప్‌మెంటు బ్లాకులనేవి ఎన్నిక చేయబడుతాయి. ఒక్కొక్క బ్లాకులో మొత్తము 60,000 నుండి 70,000 వరకు జనాభాగల 100 గ్రామాలుంటాయి.

ప్ర : జాతీయ విస్తరణ కార్యక్రమమంటే యేమిటి ?

ఉ : "విస్తరణ" అనే పదం, గ్రామీణ ప్రజలకు శాస్త్రవిజ్ఞానము సులభగ్రాహ్యమగునట్లు అందజేసి, తద్వారా వారు తమ జీవన పరిస్థితులను అభివృద్ధి చేసికొనునట్లు తోడ్పడుటను సూచిస్తుంది. ఇందు నిమిత్తం ప్రత్యేకమైన సిబ్బంది నియమించబడింది. ప్రతి బ్లాకుకు ఒక బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, ఏడుగురు ఎక్స్టెన్షన్ ఆఫీసర్లు, 10 గ్రామసేవకులు వుంటారు. 1953 అక్టోబరు నెలలో ప్రారంభమైన జాతీయ విస్తరణకార్యక్రమం తొలిప్రణాళిక ముగియునప్పటికి గ్రామీణ ప్రాంతాలందు నాల్గవ భాగమునకు విస్తరింపజేయబడింది. రెండవ ప్రణాళిక ముగియునప్పటికి దీనిని దేశవ్యాప్తం చేయాలని ఆదిలో ఉద్దేశించబడింది. అయితే వికాస కార్యక్రమ నిర్వహణలో చేయబడిన కొన్ని మార్పుల దృష్ట్యానేమి, తర్ఫీదు పొందిన సిబ్బంది కొరత దృష్ట్యానేమి ఈ గడువిప్పుడు 1963 సం. అక్టోబరు వరకు పొడిగించబడింది.

ప్ర: డెవలప్‌మెంటు బ్లాకులందు వికాసకార్యక్రమం యే విధంగా నిర్వహించబడుతుంది?

ఉ: 1952 సం. లో ఈ కార్యక్రమము నిమిత్తం యెన్నిక చేయబడిన మొదటి 55 బ్లాకులందు మూడు సం. ల పాటు వ్యవసాయము, గ్రామీణ జీవితానికి సంబంధించిన తదితర ముఖ్యరంగములందు తీవ్రమైన కృషి జరగాలని ఉద్దేశించబడింది. ఒక సం. గడచిన తరువాత యిదే తీరులో కార్యక్రమమును త్వరితగతిన దేశవ్యాప్తం చేయడానికి తగినంతగా సిబ్బంది, ధనము లభించదని కనుగొనబడింది. ఈ యిబ్బందులను అధిగమించడానికి ఈ కార్యక్రమం మూడుదశల క్రింద విభజించబడింది. మొదటిది, జాతీయ విస్తరణ కార్యక్రమదశ. ఇది మూడు సం. లు. ఈ మూడు సంవత్సరములలో బ్లాకులందు కృషి గ్రామీణజీవితానికి సంబంధించిన ముఖ్యరంగములకే పరిమితమై యుంటుంది. తరువాత రెండవ దశలో (ఇదికూడ మూడు సం. లే) తీవ్రతరమైన కృషి జరుగుతుంది. ఈ 6 సం.లు పూర్తియైన తరువాత బ్లాకు "పోస్టు ఇన్‌టెన్సివ్" దశను ప్రవేశిస్తుంది. ఈ దశలో జాతీయ విస్తరణ పథకం, రాష్ట్రి అభివృద్ధిశాఖల తరఫున వివిధ అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణకు ఒక ఖాయమైన పరిపాలనా వ్యవస్థగా పనిచేస్తుంది.

1958 సం. ఏప్రిల్‌లో వికాస కార్యక్రమ నిర్వహణలో ఒక ముఖ్యమైన మార్పు చేయబడింది. ఇదివరలో మాదిరి మూడు దశలలో గాకుండా యికముందు ఈ కార్యక్రమం ఒక్కొక్కటి 5 సం. లు గల రెండు దశలలో అమలు జరుపబడుతుంది. మొదటి దశకు రూ. 12 లక్షల ఖర్చు కేటాయించబడింది. రెండవ దశకు

రూ. 5 లక్షలు మాత్రమే. ప్రతి బ్లాకు మొదటదశను ప్రవేశించడానికి ముందు ఒక సం. పాటు వ్యవసాయమునందు తీవ్రంగా కృషి జరుపవలసి యుంటుంది.

ప్ర : జాతీయవిస్తరణ పథకము తాత్కాలికమైనదా, లేక నిరంతరం కొనసాగుతుందా ?

ఉ : శాస్త్రవిజ్ఞానము నందజేసి, తద్వారా గ్రామీణ ప్రజల జీవన పరిస్థితులను సర్వతోముఖంగా అభివృద్ధి చేయడానికి ఉద్దేశించబడిన ఈ పథకం తాత్కాలికమైనది కాజాలదు. ఇది నిరంతరం కొనసాగెడిదే. అయితే కాలక్రమేణా వికాస, విస్తరణ కార్యక్రమాల క్రింద జరిగే కృషి రాష్ట్రీసంక్షేమ కార్యకలాపాలతో విలీనం చేయడం జరుగుతుంది.

ప్ర : ఈ లీనీకరణ యేవిధంగా జరుగుతుంది ?

ఉ : ఇందు నిమిత్తం సుసంఘటితమైన వ్యవస్థ ఒకటి ఏర్పాటు చేయబడింది. ఈ కార్యక్రమ నిర్వహణకు అత్యున్నత స్థాయిలో కేంద్రప్రభుత్వమందు వికాస కార్యక్రమ మంత్రిత్వ శాఖ యేర్పాటు చేయబడింది. తరువాత రాష్ట్రస్థాయిలో ముఖ్యమంత్రి అధ్యక్షుడుగాను, అభివృద్ధి శాఖల మంత్రులు సభ్యులుగాను గల రాష్ట్ర అభివృద్ధి సంఘమొకటి వుంటుంది. డెవలప్‌మెంటు కమీషనరుగా నియమించబడే అనుభవజ్ఞుడైన ఒక ఉన్నతోద్యోగి ఈ సంఘానికి కార్యదర్శిగా వుంటాడు. ఈయన రాష్ట్ర అభివృద్ధి శాఖల అధిపతులకు ముఖ్యాధిపతిగా వ్యవహరిస్తాడు. ఇదేవిధంగా జిల్లాస్థాయిలో కలెక్టరు లేకపోతే డిప్యూటీ కమీషనర్ జిల్లా అభివృద్ధి శాఖల అధి

పతుల జట్టుకు అధిపతిగా వ్యవహరిస్తూ వుంటాడు. ఇదేవిధంగా సబ్ డివిజనల్ ఆఫీసరు కూడా. తరువాత బ్లాకు స్థాయిలో బ్లాకు డెవలప్ మెంటు ఆఫీసరు ఆధిపత్యంక్రింద కార్యక్రమం అమలు జరుగుతుంది. ఆఖరికి గ్రామస్థాయిలో అభివృద్ధిపనులకు బాధ్యత వహించేందుకు గ్రామ సేవకుడున్నాడు. ఇతను గ్రామంలోని ప్రముఖుల సహకారంతో గ్రామస్థులతో కలిసిమెలిసి వ్యవహరిస్తూ అభివృద్ధి పనులను నిర్వహిస్తూ వుంటాడు.

ఈ విధంగా సమాజవికాస కార్యక్రమం, జాతీయవిస్తరణ కార్యక్రమాలక్రింద జరుగుతున్న కృషి రాష్ట్రసంక్షేమ కార్యకలాపాలతో క్రమ క్రమంగా విలీనం చేయడం జరుగుతున్నది.

# 7. పరిశ్రమలు

ప్ర : రెండవ ప్రణాళికలో పరిశ్రమల అభివృద్ధికి ప్రముఖమైన స్థానమివ్వబడింది. ఇందు ప్రభుత్వ, ప్రైవేటు రంగములకుగల పాత్ర యెట్టిది ?

ఉ : మనము లక్ష్యముగా పెట్టుకొన్న సోషలిస్టు సామాజిక వ్యవస్థకు అనుగుణ్యముగా 1948 సం॥పు పారిశ్రామిక తీర్మానం సవరించబడింది. ఈసవరణ ప్రకారం దేశపారిశ్రామికాభివృద్ధిలో ప్రభుత్వం ప్రత్యక్షంగా ప్రముఖమైన పాత్ర వహించనున్నది.

1956 సం. ఏప్రిల్‌లో ప్రకటించబడిన ఈ క్రొత్త తీర్మానం, పారిశ్రామికాభివృద్ధికి, విశేషించి భారీపరిశ్రమల స్థాపనకు బాగా కృషి జరగాలనీ; ప్రభుత్వ పారిశ్రామిక రంగము క్రమక్రమంగా విస్తరించాలనీ; ప్రైవేటు పరిశ్రమలందు సహకారపద్ధతి వ్యాప్తిచెందాలనీ నిర్దేశిస్తున్నది. పూర్తిగా ప్రభుత్వరంగమునకే ప్రత్యేకించబడిన పరిశ్రమలలో ముఖ్యమైనవి ఆయుధములు, మందుగుండు, అణుశక్తి, ఇనుము, ఉక్కు, భారీయంత్రములు, బొగ్గు, లిగ్నైటు, ఖనిజతైలములు, విమానయానం, రైల్వేలు, నౌకానిర్మాణం, టెలిఫోన్ పరిశ్రమలు. ఇవిగాకుండా ఇనుము, మాంగనీసు, క్రోమైట్, రాగి, సీసము మొదలగు ముఖ్యఖనిజముల త్రవ్వకము, "ప్రాసెసింగ్", పరిశ్రమలుకూడా ప్రభుత్వరంగము క్రిందికి తీసికొనిరాబడ్డాయి. అల్యూమినము, యంత్ర

పరికరములు, పైన వివరించబడినవి మినహా మిగతా ఖనిజముల త్రవ్వకం, ఎఱువులు, రోడ్డురవాణా, సముద్రములద్వారా రవాణా మొదలగు పరిశ్రమలందు ప్రయివేటురంగమునకుకూడా కొంత అవకాశ మివ్వబడినప్పటికీ కాలక్రమేణా యివి ప్రభుత్వ యాజమాన్యము క్రిందికి తీసికొని రాబడుతాయి. ఇవన్నీపోగా మిగిలిన పరిశ్రమల అభివృద్ధి, నిర్వహణ బాధ్యతలు ప్రైవేటురంగమునకే వదలివేయబడ్డాయి. అయితే, వీనిని క్రమబద్ధంచేసే హక్కు ప్రభుత్వానికి వుంటుంది.

**ప్ర: భారీయెత్తు పరిశ్రమల అభివృద్ధికి ప్రణాళికలో కేటాయించబడిన మొత్తమెంత?**

ఉ: ప్రణాళికలో ప్రభుత్వరంగమునందు పెద్ద తరహా, మధ్య తరగతి పరిశ్రమల అభివృద్ధి నిమిత్తం మొత్తము రూ. 617 కోట్లు కేటాయించబడింది. ఇదిగాకుండా ఖనిజముల త్రవ్వకమునకు రూ. 73 కోట్లను కేటాయించడం జరిగింది. కాగా, జాతీయ పారిశ్రామికాభివృద్ధి సంస్థ, ప్రైవేటురంగములు రెండూకలసి చేపట్టే పారిశ్రామికాభివృద్ధి కార్యక్రమాల నిమిత్తం మొత్తము రూ. 720 కోట్లు ఖర్చు కాగలదని అంచనా. ఇందు రూ. 570 కోట్లు క్రొత్త పెట్టుబడిగాను, మిగిలిన 150 కోట్లు పాతయంత్రముల స్థానే క్రొత్త యంత్రములను ప్రవేశపెట్టుటకు, పరిశ్రమల ఆధునికీకరణకు వినియోగించడం జరుగుతుంది.

**ప్ర: పరిశ్రమల ఉత్పాదకశక్తి విస్తరణవిషయంలో ప్రభుత్వం నిర్దేశించిన ప్రాధాన్యక్రమమెట్టిది?**

ఉ: ప్రాధాన్యక్రమము దిగువ వివరించబడిన ప్రకారం నిర్దేశించబడింది:

(1) ఇనుము, ఉక్కు, భారీరసాయనిక ద్రవ్యములు, నత్రజని యెరువుల వుత్పత్తి పెంపొందించుట; భారీయింజనీరింగు, యంత్ర నిర్మాణపరిశ్రమల విస్తరణ;

(2) అల్యూమినం, సిమెంటు, కెమికల్ పల్ప్, అద్దకపు రంగులు, అత్యవసర ఔషధముల ఉత్పత్తిని పెంపొందించుట;

(3) ఇదివరకేవుండి పనిచేస్తున్న నూలువస్త్రములు, పంచదార, జనపనార మొదలగు ముఖ్యజాతీయపరిశ్రమల ఆధునికీకరణ;

(4) ఉత్పాదకశక్తి వుండికూడా, ఉత్పత్తి తగినంతగాలేని పరిశ్రమలందలి లోపములను తొలగించి. వాని ఉత్పత్తిశక్తినిపూర్తిగా వినియోగించుట;

(5) వినిమయ వస్తుపరిశ్రమల ఉత్పాదకశక్తిని పెంపొందించుట.

ప్ర: రెండవ ప్రణాళికలో ఉక్కువుత్పత్తికి అత్యధికప్రాధాన్య మివ్వబడడానికి కారణమేమిటి? దీని ఉత్పత్తిని పెంపొందించుటకు తీసికొనబడుతున్న చర్యలేమిటి?

ఉ: ప్రణాళికలో ఇనుము, ఉక్కు పరిశ్రమలకు అత్యధిక ప్రాధాన్య మివ్వబడినదంటే, మన ఆర్థికవ్యవస్థ ముఖ్యంగా వీనిమీదనే ఆధారపడివుండటం కారణం. అదీకాక, ఈ ముఖ్యవస్తువులను యితరదేశాలలోకంటె తక్కువఖర్చుతోనే ఉత్పత్తిచేయడానికి తగిన పరిస్థితులు, అవకాశములు మనదేశంలో వున్నాయి.

రెండవప్రణాళిక ముగియులోపల ప్రభుత్వరంగంలో ఒక్కొక్కటి 10 లక్షల టన్నుల ఉత్పాదకశక్తిగల మూడు ఉక్కు కర్మా

గారములను నెలకొల్పాలని సంకల్పించబడింది. వీనిలో ఒకటి 3,50,000 టన్నుల "ఫాం(డ్రీ(గేడ్" దుక్క-ఇనుమునుకూడా ఉత్పత్తి చేయుటకు వీలుగా నిర్మించబడుచున్నది. ఈమూడు కర్మాగారములకు మొత్తము రూ. 350 కోట్లు ప్రత్యేకించబడింది. వీనిలో ఒకటి మధ్యప్రదేశములో భిలాయ్‌వద్దను; రెండవది ఒరిస్సాలో రౌర్కెలా వద్దను; మూడవది ప. బెంగాల్‌లో దుర్గాపూర్ వద్దను నిర్మించబడుతున్నాయి. కాగా, మైసూరు రాష్ట్రమందున్న ఇనుము, ఉక్కు కర్మాగారపు ఉత్పాదకశక్తిని పెంపొందించడానికి రూ. 6 కోట్లు ప్రత్యేకించబడింది. 1960-'61 సం. నాటికి ప్రభుత్వరంగమునకు చెందిన ఈ నాలుగు కర్మాగారములు కలసి సాలుకు 20 లక్షల టన్నులకుపైగా ఉక్కును ఉత్పత్తిచేయగలవు.

ఇక ప్రయివేటు రంగములోనైతే టాటాఉక్కు-కర్మాగారము; ఇండియన్ ఐరన్ అండ్ స్టీల్ కర్మాగారముల వుత్పత్తిశక్తి 23 లక్షల టన్నులకు పెంపొందగలదని ఆశించబడుచున్నది. ఈవిధంగా రెండవ ప్రణాళిక ముగియునప్పటికి దేశమందలి ముఖ్యకర్మాగారము లన్నీ కలసి సాలుకు 43 లక్షలటన్నులఉక్కును ఉత్పత్తి చేయగలవని ఆశించవచ్చును. 1955-'56 సం. లో నైతే మన దేశంలో ఉక్కు ఉత్పత్తి 13 లక్షల టన్నులు మాత్రమే.

ప్ర: రెండవ ప్రణాళిక కాలంలో దేశమందలి ముఖ్య పరిశ్రమలకు నిర్దేశించబడిన అదనపు ఉత్పాదకశక్తి, ఉత్పత్తి లక్ష్యములేమిటి?

ఉ: రెండవ ప్రణాళికలో పారిశ్రామికరంగమందు తీవ్రమైన, సర్వతోముఖమైన కృషి జరుగనున్నది. ముఖ్య పరిశ్రమలకు నిర్దేశించబడిన అదనపు ఉత్పాదకశక్తి, ఉత్పత్తి లక్ష్యములు ప్రక్క పట్టికయందివ్వబడినాయి.

| పరిశ్రమ | యూనిట్ | 1955 - '56 ఉత్పాదకశక్తి (అంచనా) | 1955 - '56 ఉత్పత్తి (అంచనా) | 1960 - '61 అదనపు ఉత్పాదకశక్తి | 1960 - '61 అదనపు ఉత్పత్తి |
|---|---|---|---|---|---|
| 1. ఫినిష్డ్ ఉక్కు (ముఖ్యకర్మాగారములు) | వేలటన్నులు | 1,300 | 1,300 | 3,380 | 3,000 |
| 2. హెవీఫౌండ్రీ - ఫోర్జ్‌షాపులు : | | | | | |
| (ఎ) ఉక్కు ఫౌండ్రీ | టన్నులు | .... | .... | 15,000 | 15,000 |
| (బి) ఫోర్జింగ్‌షాపులు | ,, | .... | .... | 12,000 | 12,000 |
| (సి) పోతయినుము ఫౌండ్రీలు | ,, | .... | .... | 10,000 | 10,000 |
| 3. అల్యూమినం | ,, | 7,500 | 7,500 | 22,500 | 17,500 |
| 4. రైలు ఇంజన్లు | సంఖ్య | 170 | 170 | 230 | 225 |
| 5. జనపనార | వేలటన్నులు | 1,200 | 10,040 | .... | 60 |
| 6. పంచదార | ,, | 1740 | 1670 | 760 | 580 |
| 7. నూలు వస్త్రపరిశ్రమ | | | | | |
| (ఎ) దారము | కోట్లపౌనులు | 175* | 163† | .... | 320 |
| (బి) మిల్లుగుడ్డ | కోట్ల గజములు | 492* | 510† | .... | వివరము లభించలేదు |
| 8. సల్ఫ్యూరికాసిడ్ | వేల టన్నులు | 242 | 170 | 258 | 300 |

| పరిశ్రమ | యూనిట్ | 1955-'56 ఉత్పాదకశక్తి (అంచనా) | 1955-'56 ఉత్పత్తి (అంచనా) | 1960-'61 అదనపు ఉత్పాదకశక్తి | 1960-'61 అదనపు ఉత్పత్తి |
|---|---|---|---|---|---|
| 9. కాస్టిక్ సోడా * | టన్నులు | 44,300 | 36,000 | 1,06,100 | 99,400 |
| 10. వస్త్రజని ఎరువులు | టన్నులు | 85,000 | 77,000 | 2,97,000 | 2,13,000 |
| 11. నౌకానిర్మాణం | జి. ఆర్. టి. | .... | 50,000 | .... | 40,000 |
| 12. సిమెంటు | వేల టన్నులు | 4,930 | 4,280 | 11,070 | 8,720 |
| 13. పెట్రోలియం శుద్ధి | ,, | 3,625 | 3,600 | 685 | 700 |
| 14. పేపరు, పేపరుబోర్డు | ,, | 210 | 200 | 240 | 150 |
| 15. న్యూస్‌ప్రింట్ | టన్నులు | 30,000 | 4,200 | 30,000 | 55,800 |
| 16. బైసికిళ్లు | వేల సంఖ్య | 760 | 550 | 135 | 700‡ |

* 1955 జనవరికి సంబంధించిన వివరములు.

† 1955 అంకెలు.

‡ వికేంద్రీకృత రంగముతో సహా.

ప్ర : ప్రభుత్వ రంగమందలి ముఖ్య పరిశ్రమలేమిటి? వాని కయ్యే ఖర్చుయెంత ?

ఉ: రాష్ట్రప్రభుత్వాల పారిశ్రామిక పథకములు, జాతీయ పారిశ్రామికాభివృద్ధి సంస్థ చేపట్టనున్న పథకములు మినహా ప్రభుత్వ రంగమునకు చెందిన ముఖ్యపరిశ్రమలు, వానిఖర్చు వివరములు దిగువపట్టికయందివ్వబడ్డాయి.

(కోట్ల రూ. లలో)

| పరిశ్రమలు | 1956 మార్చి 31 వరకు అయినఖర్చు | 1956–'61 సం. మధ్యాఖర్చు |
|---|---|---|
| 1. ఉక్కు కర్మాగారములు | 7.75 | 350 |
| 2. ద. ఆర్కాట్ లిగ్నైటు ప్రాజెక్టు | 0. 5 | 52.0 |
| 3. సింద్రీ ఎరువుల ఫ్యాక్టరీ (విస్తరణ) | 28 | 7.0 |
| 4. నంగల్ ఎరువులఫ్యాక్టరీ, హెవీ-వాటర్ ఫ్యాక్టరీ | — | 22.0 |
| 5. హిందూస్తాన్ నౌకానిర్మాణ కేంద్రము (విస్తరణ) | 6.0 | 9.8 |
| 6. రూర్కేలా ఎరువులఫ్యాక్టరీ | — | 15.0 |
| 7. హెవీ ఎలక్ట్రికల్ ప్లాంట్ | 0.2 | 20.0 |
| 8. హిందూస్తాన్ మెషిన్ టూల్సు ఫ్యాక్టరీ (విస్తరణ) | 4.4 | 2.0 |
| 9. డి. డి. టి. ఫ్యాక్టరీలు | 0.5 | 1.0 |
| 10. హిందూస్తాన్ ఆంటీ - బయోటిక్స్ (విస్తరణ) | 2.1 | 1.0 |
| 11. నేషనల్ ఇన్స్ట్రుమెంట్స్ ఫ్యాక్టరీ | 0.6 | 0 65 |
| 12. హిందూస్తాన్ కేబుల్స్ (విస్తరణ) | 1.6 | 0.5 |

| | | |
|---|---|---|
| 13. ఉప్పుపరిశ్రమ అభివృద్ధి | 0.3 | 2.0 |
| 14. చిత్తరంజన్ రైలుఇంజనుల కర్మాగారం (విస్తరణ) | 14.6 | 5.0 |
| 15. ఇంటెగ్రల్ కోచ్‌ఫ్యాక్టరీ | 5.2 | 10.0 |
| 16. మీటర్‌గేజ్ కోచ్‌ఫ్యాక్టరీ | | |
| 17. ఇండియన్ టెలిఫోన్ ఇండస్ట్రీస్ (విస్తరణ) | 4.1* | 0.5 |

ప్ర : ప్రయివేటురంగమందలి పరిశ్రమలు సక్రమమార్గాల అభివృద్ధి గాంచుటకు ప్రభుత్వం యెట్టిచర్యలను తీసికొంటున్నది ?

ఉ : 1951 సం. పరిశ్రమల (అభివృద్ధి, క్రమబద్ధీకరణ) చట్టము క్రింద ప్రయివేటురంగమందలి యేపరిశ్రమనైనా పరిశీలించి, దాని నిర్వహణలో ఎడతెగని లోపాలున్నట్లు కనుగొనబడితే ఆపరిశ్రమను తన ఆధిపత్యముక్రిందకు తీసికొనే హక్కు ప్రభుత్వానికి వున్నది. మరిన్ని పరిశ్రమలకు వర్తించేటట్లు ఈచట్టము రెండుసార్లు సవరించబడింది. ఈచట్టముక్రింద క్రొత్త పరిశ్రమలకు లైసెన్సులిచ్చేందుకు ఒక కమిటీ యేర్పాటైంది. క్రొత్తపరిశ్రమలను ప్రారంభించడానికి ఉన్న పరిశ్రమలను విస్తరింపజేయడానికి అనుమతి కోరుతూ వచ్చే దరఖాస్తులను ఈకమిటీ పరిశీలించి ప్రభుత్వానికి సలహాలిస్తుంది.

ఈ చట్టముక్రిందనే పెక్కు ముఖ్యపరిశ్రమల (భారీ రసాయనిక ద్రవ్యములు, పంచదార, బైస్కిళ్లు, విద్యుత్ పరికరములు,

---

* మైసూరు ప్రభుత్వం పెట్టుబడి రూ. 31 లక్షలు మినహా.

ఔషధములు మొదలగునవి) అభివృద్ధినిమిత్తం ప్రత్యేకంగా సమితులు యేర్పాటు చేయబడ్డాయి.

ప్రయివేటు పరిశ్రమలందు నిర్ణీతప్రమాణాలకు భంగముకలుగకుండా తగుచర్యలను తీసికొనేనిమిత్తం కంపెనీల చట్టముకూడా సవరించబడింది.

ప్ర: విదేశీపెట్టుబడి విషయంలో ప్రభుత్వ విధానమెట్టిది?

ఉ: మన దేశంలో స్థాపించుటకు తగినంతగా సౌకర్యాలులేని పరిశ్రమల విషయంలోను, ఇతర దేశాల సాంకేతిక సహాయం అవసరమైన ముఖ్య పరిశ్రమల విషయంలోనుకూడా ప్రభుత్వం విదేశాల పెట్టుబడిని ఆహ్వానిస్తూనేవుంది. అయితే సాధ్యమైనంత వరకు యిట్టి పరిశ్రమల యాజమాన్యం భారతీయుల చేతులలోనే వుండటం వాంఛనీయమని ప్రభుత్వం భావిస్తున్నది. విదేశాలనుండి వచ్చిన నిపుణులస్థానే కాలక్రమేణా నియమించబడేందుకు వీలుగా భారతీయులకు తర్ఫీదివ్వబడాలనికూడా ప్రభుత్వం కోరుతున్నది.

దేశాభివృద్ధి దృష్ట్యా అవసరమని తోచినంత మేరకు విదేశీ పెట్టుబడిని ఆకర్షించే నిమిత్తం ప్రభుత్వం కొన్ని హామీలనిచ్చింది. పారిశ్రామిక తీర్మానమును వర్తింపజేయడంలో విదేశీ, భారతీయ పరిశ్రమలకు వ్యత్యాసమేమీ చూపబడదనీ; లాభాలను తమ దేశాలకు పంపుకొనడానికీ, పెట్టుబడిని తరలించుకోడానికీ తగు సౌకర్యాలు కల్పించబడగలవనీ; విదేశీ పెట్టుబడులు గల పరిశ్రమలేవైనా జాతీయం చేయబడితే సరసమైన నష్టపరిహారం యివ్వబడగలదనీ ప్రభుత్వం హామీలనిచ్చింది.

రెండవ ప్రణాళిక కాలంలో ప్రయివేటు పరిశ్రమల రంగమునకు దాదాపు రూ. 100 కోట్ల వరకు (సప్లైయర్ల పరపతితో సహా) విదేశీ పెట్టుబడి రాగలదని ఆశించబడుచున్నది.

ప్ర: పరిశ్రమల అభివృద్ధికి ఖనిజోత్పత్తిని పెంపొందించడం అవసరంకదా! రెండవ ప్రణాళికలో ముఖ్య ఖనిజముల ఉత్పత్తికి పెట్టుకొన్న లక్ష్యాలేమిటి ?

ఉ: ప్రణాళికలో ఖనిజముల త్రవ్వకమునకు రూ. 73 కోట్లు ప్రత్యేకించబడింది. ముఖ్యఖనిజముల ఉత్పత్తి లక్ష్యాలు దిగువ నివ్వబడ్డాయి :—

| ఖనిజము | యూనిట్ | 1954 సం. ఉత్పత్తి | 1960—61 లక్ష్యము |
|---|---|---|---|
| బొగ్గు | లక్షల టన్నులు | 370 | 600 |
| ఇనుము | ,, | 43 | 125 |
| మాంగనీసు | ,, | 14 | 20 |
| సున్నపురాయి | ,, | సమాచారము లభించలేదు. | 233 |
| జిప్సమ్ | ,, | 6.1 | 19.7 |
| బాక్సైటు | వేలటన్నులు | 75 | 175 |

ఈ సందర్భములో రెండు ముఖ్యావిషయాలను గురించి చెప్పవలసియున్నది. ఖనిజములన్నింటిలోకీ అత్యంత ప్రధానమైన బొగ్గు ఉత్పత్తి విషయంలో క్రొత్తగనుల అన్వేషణ, త్రవ్వకం పూర్తిగా ప్రభుత్వమే చేపట్టనున్నది. ప్రణాళికలో ఖనిజ తైలముల అన్వేషణకు కూడ విశేష ప్రాధాన్యమివ్వబడింది. ప్రస్తుతం మన దేశంలో వీని ఉత్పత్తి బహుస్వల్పమై యుండటయే దీనికి కారణం.

## 8. కుటీర పరిశ్రమలు, చిన్న తరగతి పరిశ్రమలు

ప్ర: జాతీయ ఆర్థిక వ్యవస్థలో కుటీర, చిన్న తరగతి పరిశ్రమలకు గల పాత్ర యెట్టిది?

ఉ: ఈ పరిశ్రమలు మన ఆర్థిక వ్యవస్థలో అంతర్భాగమై యున్నవి. సక్రమ మార్గాల అభివృద్ధి చేయబడితే, యివి గ్రామీణ ప్రాంతాలందు బహుళముగా పనిపాటులను కల్పించి, ప్రజల జీవన స్థాయిని పెంపొందించి, తద్వారా గ్రామీణ ఆర్థిక వ్యవస్థను పటిష్ఠ మొనర్చగలవు. ఆధునిక పద్ధతులు ప్రవేశపెట్టబడేకొలదీ, గ్రామీణ పరిశ్రమలు త్వరితగతిన అభివృద్ధిచెంది, జీవనస్థాయి పెంపొందిన ఫలిత ముగా ప్రజలకు కలిగే నూతనావసరములను కూడా తీర్చగలిగే స్థాయికి రాగలవు. గ్రామీణ పరిశ్రమలు, ఇతర చిన్న తరగతి పరిశ్రమలు ఒకప్రక్క వ్యవసాయరంగముతోను, వేరొకప్రక్క పెద్ద తరగతి పరిశ్రమలతోను సన్నిహితత్వమును పెంపొందించుకొంటూ వృద్ధిగాంచవలసియున్నది.

ప్ర: కుటీర పరిశ్రమలు, చిన్నతరగతి పరిశ్రమలు అప్పుడప్పుడు పెద్ద పరిశ్రమలపోటీకి తట్టుకొనలేక తీవ్రంగా నష్టపడటం సంభవి స్తున్నది. ఈ యిబ్బందిని తొలగించడానికి తీసికొనబడుతున్న చర్యలేమిటి?

ఉ: ఈ సమస్యను పరిశీలించిన మీదట ప్రణాళికా సమితి కొన్ని సిఫార్సులను చేసింది. అవి: (1) చిన్న తరగతి పరిశ్రమలకు, పెద్ద తరగతి పరిశ్రమలకు ఉత్పత్తిరంగములను ప్రత్యేకించుట; (2) అవసరమైనచోట్ల పెద్దతరగతి పరిశ్రమల విస్తరణను ఆపివేయుట; (3) పెద్దతరగతి పరిశ్రమలపై సెస్సును విధించి తద్వారా లభించే సొమ్మును అదేరకం చిన్నతరగతి పరిశ్రమల అభివృద్ధికి వినియోగించుట, మొదలగునవి. ఈ చర్యలద్వారా చిన్న తరగతి పరిశ్రమలు బలపడి, గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో తమకుగల పాత్రను జయప్రదంగా నిర్వహించగలవని ఆశించబడుచున్నది.

ప్ర: పెద్ద పరిశ్రమలనుండి పోటీ మినహా ఈ పరిశ్రమలను యెదుర్కొనుచున్న ముఖ్య సమస్య లేమిటి? వానినేవిధంగా పరిష్కరించ తలపెట్టబడింది?

ఉ: గ్రామీణ పరిశ్రమలు, చిన్న తరగతి పరిశ్రమలను యెదుర్కొనుచున్న యితర ముఖ్యసమస్యలను మూడు రకాలక్రింద విభజించవచ్చును. అవి: (1) తగినంతగా ఆర్థిక, సాంకేతిక సహాయములు లభించకపోవుట; (2) నిర్వహణ, రిపేరీ సౌకర్యాలు తగినంతగా లేకపోవుట; (3) మార్కెటింగ్ సౌకర్యాలలేమి.

ఈ సమస్యలను పరిశీలించిన గ్రామీణ చిన్న తరగతి పరిశ్రమల సంఘం దిగువచర్యలను సిఫార్సు చేసింది.

(1) ఈ పరిశ్రమలకవసరమైన ముడివస్తువులను సప్లైచేసి, తయారైన వస్తువులను సరసమైనధరలకు అమ్మిపెట్టుటకు పారిశ్రామిక సహకారసంఘాలను యేర్పాటుచేయుట;

(2) రిజర్వుబ్యాంకు, స్టేట్ బ్యాంకు, స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్లద్వారా పరపతిసౌకర్యాల కల్పన;

(3) వీలైనచోట్ల చౌకగా విద్యుచ్ఛక్తి సరఫరా;

(4) ఈ పరిశ్రమల పురోభివృద్ధికి కేంద్రములుగా ఉపయోగ పడే పారిశ్రామిక ఎస్టేట్లను, వర్కుషాపులను నెలకొల్పుట.

రెండవ ప్రణాళికకాలంలో చిన్న పరిశ్రమలకు సాంకేతిక సహాయమునిచ్చే సర్వీసుసంస్థలసంఖ్య 20 కి పెంచబడనున్నది. జాతీయ చిన్నపరిశ్రమల సంస్థకూడ వీనికి వాయిదాలపద్ధతిపై యంత్రములను సప్లైచేసి, ఆర్డర్లనుసేకరించి సహాయపడగలదు.

ప్ర : రెండవప్రణాళికలో గ్రామీణ, చిన్నతరగతి పరిశ్రమల అభివృద్ధికి కేటాయించబడిన మొత్తమెంత ? ఈ మొత్తము యే యే పరిశ్రమలకు ఎంతచొప్పున విభజించబడింది ?

ఉ : ప్రణాళికలో గ్రామీణ, చిన్నతరగతి పరిశ్రమల నిమిత్తం రూ. 200 కోట్లు ప్రత్యేకించబడింది. ఈ మొత్తము దిగువ వివరించ బడినప్రకారం విభజించబడింది :—

| | (రూ. కోట్లలో) |
|---|---|
| 1. చేనేత పరిశ్రమ | 59.5 |
| 2. ఖాదీ (అంబరుచరఖా కార్యక్రమము మినహా) | 16.7 |
| 3. గ్రామపరిశ్రమలు | 38.8 |
| 4. చేతిపనులు | 9.0 |
| 5. పట్టుపరిశ్రమ | 9.0 |
| 6. కొబ్బరిపీచు పరిశ్రమ | 1.0 |
| 7. చిన్నతరగతి పరిశ్రమలు | 55.0 |
| 8. సామాన్య పథకములు | 15.0 |
| మొత్తం | 200 |

# 9. రవాణా, వార్తా సౌకర్యాలు

ప్ర : రెండవ ప్రణాళిక మొత్తపు వ్యయంలో దాదాపు 29 శాతము రవాణా, వార్తా సౌకర్యాల విస్తరణకే ప్రత్యేకించబడింది. వీని కింత పెద్ద మొత్తము కేటాయించబడుటకు కారణ మేమిటి ? ఈ మొత్తము యేవిధముగా ఖర్చుపెట్టబడనున్నది ?

ఉ : రెండవ ప్రపంచ యుద్ధకాలములోను, తరువాత దేశ విభజన జరిగి నప్పుడు మన రవాణా సౌకర్యాలు విపరీతమైన శ్రమకు లోనైనాయి. ఇటీవలి సంవత్సరాలలో కూడ అభివృద్ధి కార్య క్రమాల నిర్వహణలో ఇవి అధికముగా పనిచేయవలసి వచ్చింది. రెండవ ప్రణాళిక కాలంలో మరిన్ని అభివృద్ధి కార్యక్రమాలు అమలు జరుగనున్నాయి గాబట్టి మన రవాణా సౌకర్యాలను ముఖ్యంగా రైల్వేలను అభివృద్ధిచేయటం చాలా అవసరం. లేకపోతే వీనిని అమలు జరుపుటలో యిబ్బందులను యెదుర్కొనవలసి వస్తుంది. అందువల్లనే ప్రణాళికలో రవాణా, వార్తాసౌకర్యాల విస్తరణకు పెద్దమొత్తమును కేటాయించడం అవసరమైంది.

ఈ రంగమునకు కేటాయించబడిన రూ. 1385 కోట్లలో 900 కోట్లు కేవలం రైల్వేల అభివృద్ధికే ప్రత్యేకించబడింది. కాగా రూ. 266 కోట్లు రోడ్లకు, రోడ్డురవాణాకు; రూ. 100 కోట్లు నౌకా నిర్మాణం, నౌకాశ్రయాల అభివృద్ధికీ; రూ. 43 కోట్లు పౌర విమాన

యానసౌకర్యాల విస్తరణకూ; రూ. 76 కోట్లు వార్తా సౌకర్యాలు రేడియో శ్రవణ సౌకర్యాల విస్తరణకు ప్రత్యేకించడం జరిగింది.

ప్ర : రైల్వేల అభివృద్ధి కార్యక్రమంలోని ముఖ్యాంశములేమిటి?

ఉ : తొలి ప్రణాళిక కాలంలో ప్రారంభించబడిన రైల్వేల సామగ్రి, అస్తుల పునరుద్ధరణ కార్యక్రమం రెండవ ప్రణాళిక కాలంలోకూడా కొనసాగింపబడనున్నది. దీనితోబాటు దేశంలో వస్తూత్పత్తి పెరిగి, క్రొత్త ప్రాజెక్టులు చేపట్టబడేకొలది మరిన్ని రైలుమార్గాలను వేయడంతోబాటు, ఇతోధికంగా రైలు ఇంజనులను పెట్టెలను, వ్యాగనులను ఉత్పత్తి చేయవలసియుంటుంది. రెండవ ప్రణాళిక ఆఖరి సం. లో మన రైల్వేలు రమారమి 18 కోట్లటన్నుల సరకులను చేరవేయవలసి యుంటుంది. (1955-56 సం. లో మన రైల్వేలు 11.4 కోట్ల టన్నుల సరకును చేరవేశాయి) రైల్వేలకు కేటాయించబడిన మొత్తముతో ఈ కార్య భారమును పూర్తిగా నిర్వహించుట సాధ్యపడదని భావించబడుచున్నది.

పోతే రైల్వేల అభివృద్ధి కార్యక్రమమందలి ఇతర ముఖ్యాంశములు : దాదాపు 842 మై. క్రొత్తలైనుల యేర్పాటు; 1607 మై. మార్గమును "డబుల్ లైను" మార్గముగా మార్చుట; ఇదివరలో పాడైపోయిన 800 మై. మార్గమును పునరుద్ధరించుట; 2258 రైలు యింజన్లు, 11364 రైలుపెట్టెలు, 1,07,247 రైలు వ్యాగనులను సేకరించుట, మొత్తం 826 మైళ్ళ మార్గముల విద్యుచ్ఛక్తీకరణ; 1293 మై. మార్గములో డీజెల్ ఇంజనులను ప్రవేశపెట్టుట, మొదలగునవి. ఇవిగాకుండా ప్రస్తుతమున్న రైల్వే వర్కుషాపులను ఆధునికం చేయడానికి, క్రొత్తవానిని నెలకొల్పడానికికూడా పెద్దమొత్తమే

కేటాయించబడింది. రైల్వే సిబ్బందికి, రైలు ప్రయాణీకులకు మరిన్ని సౌకర్యములు కల్పించబడగలవు.

ప్ర: రైలు ఇంజనులు, పెట్టెలు, వ్యాగనులు, మొదలగువాని విషయంలో మనకుగల కొరతను తీర్చడానికి దేశంలో వీని ఉత్పత్తి ఎంతవరకు తోడ్పడగలదు?

ఉ: రెండవ ప్రణాళిక కాలంలో మనకవసరమైన రైల్వే సామగ్రి (ఇంజనులు, పెట్టెలు, వ్యాగనులు మొదలగునవి) లో 1750 ఇంజనులు, 1,00,522 వ్యాగనులతోబాటు, అవసరమైన రైలుపెట్టెలన్ని దేశంలోనే ఉత్పత్తి కాగలవని ఆశించబడుచున్నది. అచిరకాలంలోనే వీటన్నింటిలోనూ స్వయం సమృద్ధిని సాధించడానికి తగుకృషి జరుగుతున్నది.

ప్రస్తుతం మన దేశంలో చిత్తరంజన్ కర్మాగారము, టాటా కర్మాగారము (టెల్కో) లు రైలు ఇంజనులను ఉత్పత్తి చేస్తున్నాయి. చిత్తరంజన్ కర్మాగారపు ఉత్పత్తిశక్తిని 129 (1955-56) నుండి రెండవ ప్రణాళిక ముగియుసరికి 300 ఇంజనులకు పెంపొందించడానికి రూ. 5 కోట్లు ప్రత్యేకించబడింది. పోతే ప్రయివేటు రంగమునకుచెందిన "టెల్కో" కర్మాగారపు ఉత్పత్తి శక్తి ప్రస్తుతం 50 మీటరుగేజి ఇంజన్ల నుండి 100 వరకు పెంపొందగలదు. ఇక రైలుపెట్టెల విషయంలోనైతే పెరంబూరు కర్మాగారపు ఉత్పత్తి శక్తి ప్రస్తుతం సం. నకు 200 గా మన్నది. ప్రణాళిక ముగియుసరికి ఇది 350కి పెంపొందించబడనున్నది. మీటరుగేజి రైలుపెట్టెలను తయారుచేసే క్రొత్త కర్మాగారమును నెలకొల్పాలని కూడా సంకల్పించబడింది. మొత్తంమీద రెండవ ప్రణా

ళిక కాలంలో రైలుపెట్టెల ఉత్పత్తి సాలుకు 1260 నుండి 1800 వరకు, వ్యాగనుల ఉత్పత్తి సాలుకు 14,000 నుండి 25,000 కు పెంపొందగలవని ఆశించబడుచున్నది.

ప్ర: రైలు ప్రయాణమును మరింత సౌఖ్యప్రదము చేయడానికి తీసికొనబడుచున్న చర్యలేమి ?

ఉ: రెండవ ప్రణాళిక కాలంలో ప్రయాణీకుల నిమిత్తం మరిన్ని రైళ్ళు నడుపబడనున్నాయి. అయితే, ప్రయాణీకుల సంఖ్య కూడా త్వరితంగానే పెరుగుతున్నది కాబట్టి రైళ్లలో రద్దీ పూర్తిగా తగ్గే అవకాశం లేదు.

పోతే ప్రణాళికలో ప్రయాణీకుల సౌకర్యాల నిమిత్తం మరిన్ని రిటైరింగ్ రూములను, వెయిటింగ్ రూములను, ఫలహార శాలలను, మంచినీటి సౌకర్యాలను యేర్పాటుచేయ తలపెట్టబడింది. ప్లాట్‌ఫారములను పెద్దవి చేయడానికి, అవసరమైన చోట్ల ఓవర్ బ్రిడ్జ్‌లను నిర్మించడానికి కూడా తగిన చర్యలు తీసికొనబడనున్నాయి. మంచినీటి సౌకర్యాలు, స్నాన సౌకర్యాలు, వంకాలు మొదలగునవి ఇతోధికముగా యేర్పాటుచేయబడగలవు. దూరపు ప్రయాణములు వేగంగాను, సౌఖ్యంగాను, చౌకగాను వుండగలందులకై జనతా ఎక్స్‌ప్రెస్‌లు— వీనిలో మూడు "ఎయిర్ కండిషన్డ్" వి— ప్రవేశ పెట్టబడ్డాయి. అన్ని తరగతులవారికీ యిప్పుడు డైనింగుకారు, రిటైరింగు రూములందు ప్రవేశమివ్వబడుతున్నది.

ప్ర: రోడ్ల అభివృద్ధికి రూపొందించబడిన కార్యక్రమంలోవి ముఖ్యాంశములేమిటి ?

ఉ: దేశంలోని జాతీయ రహదారుల (ముఖ్యపట్టణాలను కలిపేవి) అభివృద్ధి, నిర్వహణల బాధ్యత కేంద్రప్రభుత్వానిది. కాగా, రాష్ట్రీయ రహదారుల (రాష్ట్రమందలి ముఖ్యపట్టణాలను కలిపేవి) అభివృద్ధి, నిర్వహణల బాధ్యత రాష్ట్రప్రభుత్వాలదై యున్నది. కేంద్ర ప్రభుత్వం జాతీయ రహదారులతో బాటు కొన్ని ముఖ్యమైన రోడ్ల (ఝాన్సీ – బద్దర్‌పూర్ రోడ్డు, పశ్చిమ కోస్తా రోడ్డు, పఠాన్‌కోట్– ఉధామ్‌పూర్ రోడ్డు మొ. నవి) అభివృద్ధికి కూడా కొంత సొమ్ము కేటాయించింది. రాష్ట్రములందలి ముఖ్యమైన రోడ్లఅభివృద్ధికి గ్రాంటు లివ్వబడుతాయి.

కేంద్రప్రభుత్వం రూపొందించిన రోడ్లఅభివృద్ధి కార్యక్రమం లోని ముఖ్యఅంశములు దిగువపట్టికయందివ్వబడ్డాయి:––

| | మైళ్ళు |
|---|---|
| 1. జాతీయ రహదారులు | |
| (ఎ) అక్కడక్కడ కలుపవలసినవి | 600 |
| (బి) ప్రస్తుతమున్నవాని అభివృద్ధి (గట్టిచేయడం, వెడల్పుచేయడం, మొ. పనులు) | 4,000 |
| (సి) ముఖ్యమైన వంతెనలు | 60 |
| 2. ప్రత్యేకంగా యెన్నికచేయబడినవి | |
| (ఎ) క్రొత్తరోడ్లు | 150 |
| (బి) ప్రస్తుతమున్నవాని అభివృద్ధి (గట్టిచేయడం, వెడల్పుచేయడం, మొ. పనులు) | 500 |
| 3. అంతర్రాష్ట్రీయ రహదారులు, సరిహద్దురోడ్లు, కొండ ప్రాంతములందలి రోడ్లు | |
| (ఎ) క్రొత్తరోడ్లు | 1,000 |
| (బి) ప్రస్తుతమున్నవాని అభివృద్ధి | 2,000 |

రాష్ట్రములందలి ముఖ్యమైనరోడ్లు, గ్రామసీమలను కలిపే రోడ్ల అభివృద్ధి, నిర్వహణలబాధ్యత రాష్ట్రప్రభుత్వాలదే. రెండవ ప్రణాళిక కాలంలో రాష్ట్రములందలి రోడ్లఅభివృద్ధి కార్యక్రమము క్రింద దాదాపు 18,000 మై. గట్టిరోడ్లు నిర్మించబడనున్నాయి. వెనుకబడిన ప్రాంతములందు రోడ్లనిర్మాణము విషయమై ప్రత్యేకమైనశ్రద్ధ తీసికొనబడగలదు.

ఇక గ్రామసీమలనుకలిపే రోడ్లవిషయం. రాష్ట్రప్రభుత్వాలతో బాటు, సమాజవికాస కార్యక్రమంకూడా వీనివిషయమై శ్రద్ధవహించగలవు.

ప్ర : రెండవ ప్రణాళికలో నౌకానిర్మాణాభివృద్ధికి జరుగనున్న కృషియెట్టిది ?

ఉ : రెండవ ప్రణాళికకాలంలో, తీరవాణిజ్యమును పెంపొందించడానికి (దీనివల్ల రైల్వేలు వహించవలసిన భారము కొంతవరకు తగ్గుతుంది); మన అవసరాలకు తగినట్లుగా "టాంకర్" నౌకలను నిర్మించడానికి; మనదేశం విదేశాలతోజరిపే వాణిజ్యం యితోధికంగా భారతీయ నౌకలద్వారానే కొనసాగేందుకు కృషి జరుగనున్నది.

తీరవాణిజ్యమును పెంపొందించడానికి, యిందుపాల్గొనుచున్న నౌకల "టన్నేజి"ని 3,12,000 (1955-'56) నుండి 4,12,000 (1960-'61) కి పెంపొందించాలని తలపెట్టబడింది. ఇదేకాలంలో "టాంకర్" నౌకల "టన్నేజి" 5000 నుండి 23,000 వరకు పెంపొందించ తలపెట్టబడింది. మొత్తముమీద రెండవ ప్రణాళిక కాలంలోమన నౌకల "టన్నేజి" 9,00,000 కు (తొలిప్రణాళిక ముగిసినప్పటిదానికంటె 50 శాతము యెక్కువ) పెంపొందగలదని

ఆశించబడుచున్నది. ప్రణాళిక ముగియునప్పటికి మన విదేశీ వాణిజ్యములో 15 శాతము వరకు, తీర వాణిజ్యములో దాదాపు సగభాగమూ భారతీయ నౌకలద్వారానే కొనసాగుతూ వుండగలదు.

రెండవప్రణాళికలో నౌకానిర్మాణాభివృద్ధికి రూ. 37 కోట్లు ప్రత్యేకించబడింది. ఈమొత్తములో రూ. 20 కోట్లు ఈస్టరన్ షిప్పింగ్ కార్పొరేషన్‌లోనూ, మరొక క్రొత్తకార్పొరేషన్‌లోను పెట్టుబడిగాను, మిగతాది ప్రయివేటుషిప్పింగ్ కంపెనీలకు సహాయము నివ్వడానికీ వినియోగించబడగలదు.

ప్ర : రెండవప్రణాళికలో నౌకాశ్రయముల అభివృద్ధికి తలపెట్టబడిన పథకములేమిటి ?

ఉ : దేశము పారిశ్రామికంగా అభివృద్ధిగాంచేకొలదీ, తీర వాణిజ్యం, విదేశీవాణిజ్యం పెంపొందుతాయి గాబట్టి, వీనికి తగినట్లుగా మన నౌకాశ్రయములను అభివృద్ధి చేయవలసియుంటుంది. ప్రణాళిక 5 సం.లలో మనపెద్ద నౌకాశ్రయములద్వారా జరిగే ఎగుమతులేమి, దిగుమతులేమి సాలుకు 2.5 కోట్ల టన్నులనుండి 3.25 కోట్ల టన్నులవరకు పెంపొందగలవని అంచనా.

బొంబాయి నౌకాశ్రయాభివృద్ధికి రూపొందించబడిన కార్యక్రమంలో, ప్రిన్సెస్, విక్టోరియాడాకుల విస్తరణ, అదనంగా రెండు రిపేర్‌బర్త్‌ల నిర్మాణం, చేపలనుపట్టేందుకు ప్రత్యేకమైన ఏర్పాట్లు చేరివున్నాయి. కలకత్తా నౌకాశ్రయాభివృద్ధి కార్యక్రమంలో, కిడ్డర్‌పూర్, కింగ్‌జార్జిడాకుల విస్తరణ; కిడ్డర్‌పూర్‌డాకు గోడలను బలిష్ఠం

చేయడం. ఫుల్టాపాయింట్ వద్ద "రివర్ ట్రైనింగ్ వర్క్స్"ల యేర్పాటు మొదలగునవి చేరివున్నాయి.

పోతే మద్రాసు నౌకాశ్రయాభివృద్ధి పథకములందు ముఖ్యమైనవి, ఆయిల్ డాకు యేర్పాటు; రేవులో ఆధునిక పరికరాల యేర్పాటు మొదలగునవి. కొచ్చిన్ రేవువద్ద మూడుబెర్తుల యేర్పాటుకు, అదనముగా నాలుగు 'వార్ఫ్'ల నిర్మాణానికి సొమ్ము కేటాయించబడింది. ప్రస్తుతం చురుకుగా నిర్మాణమౌతున్న కాండ్లా నౌకాశ్రయమునందు రెండు 'జెట్టీ'లు యేర్పాటు చేయబడనున్నాయి. దీనికి సమీపమున నేనున్న నిర్వాసుల వసతివాడ గాంధీధామ్ అభివృద్ధికికూడా కృషి జరుగుతున్నది. పోతే తూర్పుకోస్తాలో ముఖ్య నౌకాశ్రయములందు ఒకటైన విశాఖపట్టణంవద్ద నూనెశుద్ధి కర్మాగారం నిమిత్తం నిర్మించబడుచున్న రెండు "టెర్మినల్ బర్త్"లు రెండవ ప్రణాళిక ముగియులోపలే పూర్తి చేయబడనున్నవి. ఈ నౌకాశ్రయములో మరిన్ని ఆధునికపరికరాలు అమర్చబడనున్నాయి. ముడి ఇనుము, తదితర సరకులను విరివిగా యెగుమతిచేసేనిమిత్తం రెండు క్రొత్త "బెర్త్"లుకూడా నిర్మించబడగలవు.

ప్ర : రెండవప్రణాళిక కాలంలో పౌరవిమానయాన సౌకర్యాల అభివృద్ధికి తీసికొనబడనున్న చర్యలేమిటి ?

ఉ : రెండవప్రణాళికలో మరిన్ని విమానాశ్రయముల నిర్మాణానికి, ప్రస్తుతమున్నవాని విస్తరణకు కృషి జరుగగలదు. ప్రస్తుతం దేశంలో ముఖ్యపట్టణాలన్నింటికి విమానయాన సౌకర్యం వున్నది. మరిన్ని పట్టణాలకు ఈసౌకర్యమును కల్పించడానికి తగినచర్యలు తీసికొనబడగలవు. ఇప్పుడు దేశంలో 81 విమానాశ్రయాలున్నాయి.

రెండవ ప్రణాళిక కాలంలో మరి 8 విమానాశ్రయములు నిర్మించ బడగలవు. వీనితోబాటు మరిన్ని 'రన్‌వే'లను, "హాంగార్సు"ను, విద్యుద్దీప సౌకర్యాలను యేర్పాటుచేయతలపెట్టబడింది. ముఖ్యమైన విమానాశ్రయములందు టెలికమ్యూనికేషన్ పరికరాలు అమర్చబడనున్నాయి.

మనదేశంలో విమానయాన సర్వీసులను సమర్థముగా నిర్వహించి, అభివృద్ధి చేసేనిమిత్తం 1953 లో విమానయాన కంపెనీలు జాతీయంచేయబడి, రెండు కార్పొరేషన్లు—ఇండియన్ ఎయిర్ లైన్సు కార్పొరేషన్, ఎయిర్ ఇండియా ఇంటర్నేషనల్—నెలకొల్ప బడినాయి. వీనినిమిత్తం ఆధునిక విమానాలు ఖరీదు చేయబడగలవు. ఈ కార్పొరేషన్ల విస్తరణనిమిత్తం రెండవప్రణాళికలో రూ. 30.5 కోట్లు ప్రత్యేకించబడింది.

**ప్ర : రెండవప్రణాళిక కాలంలో గ్రామీణ ప్రాంతాలందు తంతి, తపాలు సౌకర్యాల విస్తరణకు జరుగనున్నకృషి యెట్టిది ?**

ఉ : ఈప్రణాళికలో గ్రామీణ ప్రాంతాలందు తంతి, తపాలు సౌకర్యాల విస్తరణకు ప్రత్యేకమైనశ్రద్ధ తీసికొనబడనున్నది. తొలి ప్రణాళికకాలంలో దేశము మొత్తంమీద 19,000 పోస్టాఫీసులు (క్రొత్తవి) తెరువబడినాయి. దీనితో రెండుమైళ్ళవ్యాసపు ప్రాంతంలో వుండి, మొత్తముజనాభా 2,000 కు తగ్గని ప్రతిగ్రామ సముదాయమునకు పోస్టాఫీసు సౌకర్యం కల్పించబడింది. పోతే రెండవప్రణాళిక కాలంలో మరి 20,000 పోస్టాఫీసులు తెరువబడనున్నాయి. వీనివల్ల గ్రామీణ ప్రాంతాలందు మరిన్నిగ్రామాలకీ సౌకర్యం లభించగలదని ప్రత్యేకించి చెప్పనవసరంలేదు.

ఇక తంతిసౌకర్యాల విషయం. ప్రస్తుతం దేశంలో 4,900 టెలిగ్రాఫ్ ఆఫీసులు మాత్రమే వున్నాయి. వీనిలో బహుకొద్ది మాత్రమే గ్రామీణ ప్రాంతాలందున్నాయి. రెండవప్రణాళిక కాలంలో క్రొత్తగా తెరువబడనున్న 1,400 టెలిగ్రాఫ్ ఆఫీసులలో అధిక భాగము గ్రామీణ ప్రాంతాలకు సంబంధించినవే. దేశంలోని ప్రతి గ్రామానికీ 5 మైళ్ళలోపలే తంతిసౌకర్యమును కల్పించడమే ఈవిషయంలో మనలక్ష్యం.

ప్ర : రేడియోశ్రవణ సౌకర్యాల విస్తరణకు రూపొందించబడిన కార్యక్రమంలోని ముఖ్యాంశములేమిటి?

ఉ : తొలిప్రణాళిక కాలంలో, దేశమందలి ప్రతిభాషాప్రాంతానికి కనీసం ఒక రేడియోస్టేషన్ వుండాలని పెట్టుకొన్నలక్ష్యం పూర్తిగా సాధించబడింది. కాబట్టి, రెండవ ప్రణాళిక కాలంలో క్రొత్త రేడియోస్టేషనులను యేర్పాటు చేయడంకంటే, రేడియో శ్రవణ సౌకర్యాల విస్తరణకు, వున్నవానిని మరింత శక్తివంతము చేయడానికీ యెక్కువగా కృషిజరుగుతుంది.

ఢిల్లీ కేంద్రమునుండి ప్రసారంచేయబడే జాతీయ కార్యక్రమాలు దేశమంతటా చక్కగా వినిపించగలందులకై ఢిల్లీవద్ద ఒక 100 కిలోవాట్ షార్ట్‌వేవ్ ట్రాన్సుమీటరు, ఒక 100 కిలోవాట్ మీడియంవేవ్ ట్రాన్స్‌మీటరు నెలకొల్పబడినాయి. విదేశాలందు నివసించే భారతీయులకు ఇతోధికముగా రేడియోశ్రవణ సౌకర్యాలను కల్పించేనిమిత్తం ఢిల్లీవద్దనే మరి రెండు 100 కిలోవాట్ షార్ట్‌వేవ్ ట్రాన్సుమీటర్లు, మద్రాసు, బొంబాయి, కలకత్తాలవద్ద 50 కిలోవాట్ల

షార్ట్ వేవ్ ట్రాన్స్మీటర్లు నెలకొల్పబడనున్నాయి. దేశంలో గ్రామీణ ప్రాంతాలందు రేడియోశ్రవణ సౌకర్యాలను ఇతోధికంగా కల్పించే నిమిత్తం 60,000 రేడియోసెట్లు నెలకొల్పబడగలవు.

రెండవ ప్రణాళికలో రేడియోశ్రవణ సౌకర్యాల విస్తరణకు రూ. 9 కోట్లు ప్రత్యేకించబడింది.

# 10. విద్య

ప్ర: రెండవ ప్రణాళికలో విద్యాసౌకర్యాల విస్తరణకు ప్రత్యేకించబడిన మొత్తమెంత? ఈ కార్యక్రమములోని ముఖ్యాంశములేమి?

ఉ: ప్రణాళికలో విద్యాభివృద్ధికి సంబంధించిన కార్యక్రమాల నిమిత్తం రూ. 307 కోట్లు- కేంద్ర ప్రభుత్వపు పథకములకు రూ. 95 కోట్లు; రాష్ట్రప్రభుత్వాల కార్యక్రమాలకు రూ. 212 కోట్లు- ప్రత్యేకించబడింది. ఈ కేటాయింపులు, క్రొత్త విద్యాసంస్థల యేర్పాటుకు, వున్నవానిని విస్తరింపజేయడానికి సంబంధించినవి. తొలి ప్రణాళికలో ప్రారంభించబడి, యిప్పటికీ కొనసాగుతూవున్న పథకములిందులో చేర్చబడలేదు.

పై మొత్తములతోబాటు, సమాజ వికాస కార్యక్రమం క్రింద ఆయా ప్రాంతాలందు సామాన్యవిద్యా సౌకర్యాలనిమిత్తం రూ. 12 కోట్లు, సాంఘిక విద్యాభివృద్ధి నిమిత్తం రూ. 10 కోట్లు ప్రత్యేకించబడినాయి. నిర్వాసుల పునరుద్ధరణ కార్యక్రమములో విద్యా సౌకర్యాల నిమిత్తంకూడా కొంత కేటాయింపు వున్నది.

రెండవ ప్రణాళికలో విద్యాసౌకర్యాల విస్తరణ కార్యక్రమము దిగువ ముఖ్య లక్ష్యాలతో రూపొందించబడింది.

(1) 6–11 సం. వయస్సుగల బాల బాలికలలో 63 శాతమునకు తగిన విద్యాసౌకర్యాలు కల్పించుట (1955–56 లో ఇది 51 శాతముగా నున్నది);

(2) 11-14 సం. వయస్సుగల బాలబాలికలలో 23 శాతము నకు (1955-56 సం. లో ఇది 19 శాతముగా నున్నది) తగిన విద్యా సౌకర్యాలను కల్పించుట;

(3) 14-17 సం. వయస్సుగల బాలబాలికలందు పాఠశాలలకు వెళ్ళెడి వారి సంఖ్యను (1955-56 సం. లో ఇది 9 శాతము మాత్రమే) 12 శాతమునకు పెంపొందించుట.

ఇక యూనివర్సిటీ విద్య విషయంలో నైతే, ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా విస్తరణకంటె, దీనిని సుసంఘటితం చేయడానికే ప్రాధాన్య మివ్వబడింది.

ప్ర: ప్రస్తుత విద్యావిధానం అనేక విమర్శలకు గురియైనది. **దీనిని అభివృద్ధి చేయడానికి జరుగుతున్న కృషి యెట్టిది ?**

ఉ: ప్రస్తుత విద్యావిధానంలో పుస్తక పఠనమునకు, సిద్ధాంత విషయాలకే మితిమీరిన ప్రాముఖ్యము యివ్వబడుతున్నందువల్ల బిడ్డల సహజశక్తుల పరిపూర్ణ వికాసమునకు దోహదం కలుగుటలేదు. గాంధీజీ ప్రతిపాదించిన "బేసిక్" విద్యావిధానం ఈలోపమును చాల వరకు తొలగించగలదు. తొలి ప్రణాళిక కాలంలో పెక్కు ప్రాథమిక పాఠశాలలు బేసిక్ పాఠశాలలుగా మార్చబడినాయి. తొలి ప్రణాళిక ముగియునప్పటికి దేశంలోని బేసిక్ పాఠశాలల సంఖ్య 41,898. రెండవ ప్రణాళిక కాలంలో మరి 33,400 బేసిక్ పాఠశాలలు ప్రారంభించబడనున్నాయి.

సెకండరీ పాఠశాలలందు కూడా క్రమ క్రమంగా బేసిక్ విద్యాపద్ధతి (ఏదో ఒక చేతిపని ద్వారా విద్యాబోధన) ప్రవేశ పెట్టబడగలదు. ప్రత్యేకచేతివృత్తులందు తర్ఫీదునిచ్చేందుకు సాంకేతిక పాఠశాలలు కూడా విరివిగా ప్రారంభించబడనున్నాయి. వీనియందు

తర్ఫీదు పొందినవారు సులభంగా తమ అర్హతలకు తగియున్న ఉద్యోగాలను సంపాదించుకొనగలరు. లేకపోతే అభిరుచి గలవారు చిన్న చిన్న వ్యాపారములను ప్రారంభించి, జీవనోపాధిని తేలికగా సంపాదించుకొనగలరు. ఈ మార్పులవల్ల కాలేజీ చదువులకు తాపత్రయ పడేవారి సంఖ్య చాలా వరకు తగ్గవచ్చునని ఆశించబడుచున్నది.

ఇక యూనివర్సిటీ విద్య విషయం. ఈ విద్యాప్రమాణములను అభివృద్ధిచేసే నిమిత్తం మూడు సంవత్సరాల డిగ్రీ కోర్సులను ప్రవేశ పెట్టడం; తరచుగా విద్యాగోష్ఠులను యేర్పాటుచేయడం; పరిశోధన శాలలను, లైబ్రరీలను విరివిగా యేర్పాటుచేయడం; హాస్టలు సౌకర్యాలను యెక్కువచేయడం; స్కాలర్ షిప్పులను, స్టయిపండులను విరివిగా నివ్వడం; యూనివర్సిటీ ఉపాధ్యాయుల జీతాలను పెంచడం; మొదలగు చర్యలు తీసికొనబడుతున్నాయి. పోతే గ్రామీణ జీవితమునకు సంబంధించిన ముఖ్య విషయములందు ఉన్నత విద్యాసౌకర్యములను కల్పించి, పరిశోధనలను ప్రోత్సహించే నిమిత్తం రెండవ ప్రణాళిక కాలంలో 10 గ్రామీణ విద్యాసంస్థలు యేర్పాటు చేయబడనున్నాయి.

**ప్ర: దేశము పారిశ్రామికంగా అభివృద్ధిగాంచేకొలదీ సాంకేతిక సిబ్బంది యెక్కువగా అవసరమౌతుంది. ప్రస్తుతము ఈ విషయంలో వున్న కొరతను తీర్చడానికి తీసికొనబడుతున్న చర్యలేమిటి ?**

ఉ: రెండవ ప్రణాళికలో సాంకేతిక విద్యా సౌకర్యాల నిమిత్తం రూ. 48 కోట్లు ప్రత్యేకించబడింది. అఖిలభారత సాంకేతిక విద్యాసమితి సిఫార్సుచేసిన నాలుగు ఉన్నత సాంకేతిక విద్యాసంస్థలందు ఒకటి ఖరగ్‌పూర్ వద్ద ప్రారంభించబడింది. మిగతా మూడు

దేశపు ఉత్తర, దక్షిణ, పశ్చిమ ప్రాంతాలందు వరుసగా కాన్‌పూర్, మద్రాస్, బొంబాయి నగరములందు త్వరలోనే యేర్పాటు చేయ బడగలవు. వీనితో బాటు 6 ఇంజనీరింగ్ డిగ్రీ సంస్థలు, 21 డిప్లొమా సంస్థలు యేర్పాటుచేయబడనున్నవి.

రెండవప్రణాళిక కాలంలో, ఢిల్లీవద్దనున్న పాలిటెక్నిక్ సంస్థ, ధన్‌బాద్ వద్దనున్న "ఇండియన్ స్కూల్ ఆఫ్ మైన్స్ అండ్ అప్లయిడ్ జియోలజీ" సంస్థలను విస్తరింపజేయుటతోబాటు ప్రింటింగ్ టెక్నాలజీ సంస్థ ఒకటి యేర్పాటుచేయబడనున్నది. ప్రస్తుతం పని చేస్తున్న సాంకేతిక పాఠశాలలను విస్తరింపజేయడానికీ, అవసరమైన చోట్ల క్రొత్తవానిని నెలకొల్పడానికీ, విరివిగా స్కాలర్‌షిప్‌ల నివ్వడానికి కూడా ప్రణాళికలో సొమ్ము కేటాయించబడింది.

పైన వివరించబడిన చర్యలవల్ల ఇంజనీరింగ్ డిగ్రీ కోర్సులందు చేరెడివారి సంఖ్య (1955-56 సం. లో ఇది 6,320 గా నున్నది.) 1960-61 సం. నాటికి 8,120 వరకు; డిప్లొమా కోర్సులందు చేరెడివారి సంఖ్య (1955-56 సం.లో ఇది 8,700) 11,800 వరకు పెంపొందగలదని ఆశించబడుచున్నది. జూనియర్ టెక్నికల్ పాఠశాలలందు చేరెడివారి సంఖ్యయైతే ప్రణాళిక ముగియునప్పటికి 5,400 వరకు వుండగలదు. అప్పటికీ దేశావసరాల దృష్ట్యా ఈ సిబ్బంది చాలదనీ, ఇంజనీరింగ్ డిగ్రీ కోర్సులందు సీట్లను కనీసం 20 శాతము మేరకు, డిప్లమో కోర్సులందు సీట్లను 25 శాతము మేరకు పెంపొందించవలసియుంటుందనీ ఇంజనీరింగ్ సిబ్బంది సంఘము సిఫార్సు చేసింది.

కార్మిక మంత్రిత్వ శాఖ, రైల్వేమంత్రిత్వ శాఖ, ఇనుము, ఉక్కుల మంత్రిత్వశాఖలు తమకు అవసరమైన సాంకేతిక సిబ్బంది

నిమిత్తం స్వయంగా కొన్ని తర్ఫీదు కార్యక్రమాలను నిర్వహిస్తున్నాయి.

**ప్ర: ఉపాధ్యాయుల జీతాలను, సర్వీసు నిబంధనలను అభివృద్ధి చేసే నిమిత్తం ప్రణాళికలో ప్రతిపాదించబడిన చర్యలేమిటి?**

ఉ: ప్రస్తుతం పాఠశాలలో విద్యాప్రమాణం పడిపోవడానికి ముఖ్యకారణాలలో ఒకటి, ఉపాధ్యాయులకు తక్కువ జీతాలు లభించడం, వారి సర్వీసు నిబంధనలు సంతృప్తికరమైనవి కాకపోవడమని గుర్తించబడింది. ముఖ్యంగా ప్రైమరీ, సెకండరీ పాఠశాలలందు పనిచేస్తున్న ఉపాధ్యాయుల జీతాలను పెంచవలసిన అవశ్యకత యెంతైనా యున్నది. రాష్ట్రప్రభుత్వాలు ఈ విషయంలో తగిన చర్యలను తీసికొన్నట్లయితే, అదనపు ఖర్చులో సగభాగమును భరించుటకు కేంద్రప్రభుత్వం అంగీకరించింది. పెక్కు రాష్ట్రాలు ప్రైమరీ, సెకండరీ ఉపాధ్యాయుల జీతాలను పెంచడానికి తగు చర్యలను తీసికొన్నాయి.

ఇక ఉపాధ్యాయుల సర్వీసు నిబంధనల విషయం. ప్రతి రాష్ట్రమూ ప్రాథమిక ఉపాధ్యాయులను తన సర్వీసులోకి తీసికొని వారినిమిత్తం "కేడర్"లను యేర్పాటుచేయడం మంచిదని ప్రణాళికా సమితి సూచించింది. ఈ ప్రకారం జరిగితే ఉపాధ్యాయులలో ఎవరైనా స్థానిక సంఘాలచే నిర్వహించబడే పాఠశాలలందుగానీ, ప్రయివేటు పాఠశాలలందుగానీ, పనిచేయవలసి వచ్చినప్పటికీ వారి సర్వీసు భద్రతకు, పెన్షన్, ప్రావిడెంటుఫండు సౌకర్యాలకు భంగమేమీ కలుగదు. సమర్థులైన ఉపాధ్యాయులు పైకిపోయే అవకాశములుకూడా వుండగలవు. ఈ చర్యలు తీసుకొనబడితే ఉపాధ్యాయవృత్తికి సమర్థులైనవారు రాగలరని ఆశించవచ్చును.

ప్ర: "సాంఘికవిద్య" అనగా యేమి? ప్రణాళికలో దీనికిగల స్థాన మెట్టిది?

ఉ: వయోజన విద్యను గురించి మనమంతా వినియున్నాము. ఇది కేవలం అక్షరజ్ఞానముతోనే సమాప్తి చెందకూడదు. చదువుట వ్రాయుట తెలిసినంత మాత్రంచేత ఒకవ్యక్తి సంఘములో తనకుగల పాత్రను సరిగా నిర్వహించజాలడు. అతని ఆర్థిక పరిస్థితికూడా అంతంత మాత్రంగానే వుంటుంది. కాబట్టి వయోజన విద్యలో అక్షరజ్ఞానముతో పాటు, వారి జీవన పరిస్థితులను బాగుచేసేందుకు తగిన అవకాశములు కూడా చేరివుండాలి. ఆదర్శపౌరులుగా జీవితములను గడుపుటయెట్లో, తీరిక సమయములను సద్వినియోగం చేయడమెలాగో, ఆరోగ్య విషయాలు మొదలైనవన్నీ వయోజనులకు తెలిసివుండాలి. ఈ విషయాల నన్నింటినీ దృష్టిలోకి తీసికొనే వయోజన విద్యకే "సాంఘిక విద్య" అనేపేరివ్వబడింది. సమాజ వికాస కార్యక్రమం, స్థానికాభివృద్ధి పథకము, సంక్షేమ విస్తరణ కార్యక్రమం మొదలైన గ్రామీణ ప్రాంతాల అభివృద్ధికి సంబంధించిన కార్యక్రమము లన్నింటిలోనూ సాంఘిక విద్యకు ముఖ్యమైనస్థాన మివ్వబడింది.

రెండవ ప్రణాళికలో సాంఘిక విద్యావ్యాప్తికి రూ. 15 కోట్లు ప్రత్యేకించబడింది. సమాజ వికాస కార్యక్రమం క్రింద దీని నిమిత్తం కేటాయించబడిన రూ. 10 కోట్లుకూడా పై మొత్తములో చేరియున్నది. అక్షరజ్ఞాన కేంద్రాలు, సాంఘిక విద్యాకేంద్రాలు, జనతా కళాశాలలు, లైబ్రరీలను విరివిగా ప్రారంభించడానికి, దృశ్యశ్రవణ పరికరాలద్వారా విద్యావ్యాప్తి, సిబ్బంది తర్ఫీదు మొదలగు విషయాలకు ఈ సొమ్ము వినియోగించబడగలదు.

# 11. ఆరోగ్యం

ప్ర : ఆసుపత్రి సౌకర్యాలు, వైద్యసిబ్బంది విషయాలలో మన మెంతగానో కొరతవడి యున్నాము. రెండవ ప్రణాళికకాలంలో ఈ కొరత యెంతవరకు తీరగలదు ?

ఉ : ఆసుపత్రి సౌకర్యాల విస్తరణకు, వైద్యసిబ్బంది తర్ఫీదుకు, పరికరాల కొనుగోలుకు ప్రణాళికలో రూ. 43 కోట్లు ప్రత్యేకించ బడింది. ఫలితముగా ఆసుపత్రుల సంఖ్య 12,600 కు, పడకల సంఖ్య 1,55,000 కు పెరుగగలదని ఆశించబడుచున్నది. తొలిప్రణాళిక ముగియునప్పటి సంఖ్యలకంటే ఈ సంఖ్యలు దాదాపు 25 శాతము యెక్కువ. పోతే, గ్రామీణ ప్రాంతాలందు 3,000 కు పైగా ప్రాథమిక ఆరోగ్య కేంద్రములను నెలకొల్పే నిమిత్తం రూ. 23 కోట్లు కేటాయించబడింది.

ప్రస్తుతం దేశంలో అర్హతపొందిన డాక్టర్లు 70,000 వరకు ఉన్నారు. 1960-'61 సం॥ నాటికి మరి 12,500 మంది డాక్టర్లు తర్ఫీదు పొంది యుండగలరని ఆశించబడుచున్నది. ప్రస్తుత అవసరాలనుబట్టి మనకు కనీసం 90,000 మంది డాక్టరులైనా కావాలి. ఈ ముఖ్య విషయం దృష్ట్యా ప్రస్తుతం దేశములోవున్న వైద్యకళాశాలలను విస్తరింప జేయుటతోబాటు, అవసరమైన ప్రాంతాలందు క్రొత్తకళాశాలలను ప్రారంభించాలని ప్రణాళికా సమితి సిఫార్సుచేసింది.

ఇతరరకాల వైద్యసిబ్బంది విషయంలోకూడా మనదేశంలో మిక్కుటమైన కొరతవున్నది. తొలిప్రణాళిక ముగిసినప్పటికి దేశంలో ఈ సిబ్బంది యెంతవున్నదో, రెండవ ప్రణాళికకాలంలో వీరిసంఖ్య యెంతవరకు పెరుగనున్నదో, దేశావసరాల దృష్ట్యా అసలు యెంత మంది వుండాలో మొదలగు వివరాలు దిగువపట్టికయందు యివ్వ బడినాయి :-

| సిబ్బంది | 1955-56 | 1960-61 | కావలసినవారి సంఖ్య |
|---|---|---|---|
| నర్సులు | 22,000 | 31,000 | 80,000 |
| మంత్రసానులు | 26,000 | 32,000 | 80,000 |
| హెల్త్ విజిటర్లు | 800 | 2,500 | 20,000 |
| నర్సు-దాయిలు, దాయిలు | 6,000 | 41,000 | 80,000 |
| హెల్త్ అసిస్టెంటులు, శానిటరీ ఇన్ స్పెక్టర్లు | 4,000 | 7,000 | 20,000 |

ప్ర : దేశీయ వైద్యవిధానాలకు తగిన ప్రోత్సాహమివ్వబడు తున్నదా ?

ఉ : చిరకాలంగా వస్తూవున్న ఆయుర్వేదం, యూనానీ మొద లగు దేశీయ వైద్యవిధానాలను అభివృద్ధిచేయు నిమిత్తం రెండవ ప్రణాళికలో మొత్తం రూ. 6.6 కోట్లు (కేంద్రప్రభుత్వం రూ. 1 కోటి, మిగతాది రాష్ట్రప్రభుత్వాలు కేటాయించినవి) ప్రత్యేకించబడింది. దీనికి సంబంధించిన కార్యక్రమంలో, జామ్నగర్ వద్దనున్న దేశీయ వైద్యవిధానముల పరిశోధనా సంస్థను అభివృద్ధిచేయడం; ఉన్న ఆయు ర్వేద కళాశాలలను విస్తరింపజేయుటతోబాటు క్రొత్తగా 6 కళాశాల

లను ప్రారంభించడం; 1,100 వైద్యశాలలను యేర్పాటు చేయడం. మొదలగు పనులు చేరివున్నాయి. ఈ చర్యలవల్ల ఆయుర్వేద సంస్థలు వైద్యసౌకర్యాలను ఇతోధికముగా కల్పించుటతోబాటు పరిశోధనలను నిర్వహించే స్థాయికి రాగలవని ఆశించవచ్చును.

ప్ర : దేశవ్యాప్తంగా మలేరియావ్యాధిని అరికట్టడానికి తీసికొనబడుతున్న చర్యలేమిటి ?

ఉ : మలేరియావ్యాధి తరచుగావచ్చే ప్రాంతాలందు మందులను స్ప్రేచేయడం, వ్యాధినికలిగించే దోమలను నాశనంచేయడానికి డి. డి. టి. వంటి క్రిమినాశనిమందులను వుపయోగించడం మొదలగు చర్యలద్వారా ఈవ్యాధి అరికట్టబడుతున్నది. ఈ పనులనిమిత్తం రాష్ట్రిఆరోగ్యశాఖలు కంట్రోలుయూనిట్లను యేర్పాటు చేశాయి. ఢిల్లీలోవున్న మలేరియాసంస్థ ఈ యూనిట్ల సిబ్బందికి తర్ఫీదునిస్తుంది.

ప్రస్తుతం ఢిల్లీవద్ద డి. డి. టి. మందును ఉత్పత్తిచేసే కర్మాగారం ఒకటి పనిచేస్తున్నది. రెండవప్రణాళిక కాలములో దీని ఉత్పత్తి రెట్టింపు చేయబడగలదు. కేరళరాష్ట్రిములో ఆల్వాయేవద్ద నిర్మించబడుచున్న మరొక డి. డి. టి. ఫ్యాక్టరీ ఈ సంవత్సరాంతమునకు ఉత్పత్తి నారంభించగలదు.

తొలిప్రణాళిక ముగిసినప్పటికి దేశంలోపనిచేస్తున్న మలేరియా యూనిట్ల సంఖ్య 162. రెండవప్రణాళిక కాలంలో వీనిసంఖ్య 200కు పెంచబడగలదు. ఈ ప్రణాళికలో మలేరియానిరోధక కార్యక్రమం నిమిత్తం రూ. 28 కోట్లు ఖర్చుపెట్టబడనున్నది. ఈ మొత్తముతో

దేశవ్యాప్తంగా వ్యాధినిరోధక కార్యక్రమం అమలుజరుపబడగలదని ఆశించవచ్చును.

ప్ర : క్షయవ్యాధి నివారణకు జరుగుతున్న కృషియెట్టిది ?

ఉ : ప్రతియేటా దాదాపు 5 లక్షలమందిని బలిగొంటున్న క్షయవ్యాధిని అరికట్టేనిమిత్తం తొలిప్రణాళిక కాలంలోనే బి. సి. జి. టీకాలఉద్యమం ప్రారంభమైంది. 1955-'56 సం. అంతానికి 7కోట్ల మందినిపైగా పరీక్షించి, వ్యాధి సోకే అవకాశంగలవారికి టీకాలు వేయబడినాయి. పోతే రెండవప్రణాళిక కాలంలో 25 సం. ల వయస్సుకు లోపుకలిగి ఈ వ్యాధిసోకే అవకాశం గలవారందరికీ టీకాలువేయడం జరుగుతుంది. ఈ ప్రణాళికలో క్షయవ్యాధి నివారణనిమిత్తం రూ.14 కోట్లు ప్రత్యేకించబడింది. ఈమొత్తముతో బి. సి. జి. టీకాల ఉద్యమమును దేశవ్యాప్తం చేయుటతోబాటు, 200 "చెస్టుక్లినిక్"లు యేర్పాటు చేయబడనున్నాయి. వైద్యకళాశాలలకు అనుబంధముగా 20 బోధనా కేంద్రములు నెలకొల్పబడనున్నాయి. దేశంలోని వివిధ వైద్యసంస్థలందు క్షయరోగుల నిమిత్తం అదనముగా 400 పడకలు యేర్పాటు చేయబడగలవు.

ప్ర : గ్రామీణప్రాంతాలందు, పట్టణప్రాంతములందు మంచినీటి సరఫరా నిమిత్తం రెండవ ప్రణాళికలో కేటాయించబడిన మొత్తమెంత? జరుగుతున్న కృషి యెట్టిది ?

ఉ : గ్రామీణప్రాంతాలందేమి, పట్టణ ప్రాంతాలందేమి శుభ్రమైన మంచినీటి సరఫరాకు తగినంతగా యేర్పాట్లు లేనందువల్ల, అనేక రకాల వ్యాధులు ప్రబలి, విపరీతముగా జననష్టం సంభవిస్తున్నది.

దీనినిబట్టి ప్రజారోగ్యరక్షణకు మంచినీటి సరఫరా యెంత ముఖ్యమో స్పష్టమౌతున్నది. ఈ ముఖ్య విషయందృష్ట్యా, 1954 సం. లోనే యావద్దేశానికీ సంబంధించిన మంచినీటి సరఫరా, పారిశుద్ధ్య కార్యక్రమం ఒకటి రూపొందించబడింది. తగిన సామగ్రి సమృద్ధిగా లభించనందువల్ల, తదితర యిబ్బందులవల్ల తొలి ప్రణాళిక కాలంలో ఈ విషయంలో అంతగా కృషిజరుగలేదు. రెండవ ప్రణాళిక కాలంలో ఈ ఇబ్బందులన్నీ తొలగిపోగలవు. ఈ ప్రణాళికలో పట్టణప్రాంతాలందు మంచినీటి సరఫరా పథకములనిమిత్తం రూ. 53 కోట్లు, గ్రామీణ ప్రాంతాలకు సంబంధించిన పథకముల నిమిత్తం రూ. 28 కోట్లు, కార్పొరేషన్లుగల పట్టణాల పారిశుద్ధ్యము నిమిత్తం రూ. 10 కోట్లు ప్రత్యేకించడం జరిగింది.

ప్ర: కుటుంబ నియంత్రణం యెందుకు ఆవశ్యకమైనది ? రెండవ ప్రణాళికలో దీని నిమిత్తం రూపొందించబడిన కార్యక్రమంలోని ముఖ్యాంశములేమిటి ?

ఉ: ప్రపంచమందు అత్యధిక జనాభాగల దేశాలలో మన దేశము ఒకటి. మన జనాభా యేడాదికి రమారమి 40 లక్షల చొప్పున పెరుగుతూవున్నది. ఇదే ప్రకారం పెరిగిపోతే, ప్రజలకు అత్యంతావశ్యకమైన జీవితావసర వస్తువుల సరఫరా క్రమముగా తగ్గి, దేశంలో కరువు పరిస్థితులు పర్పడవచ్చును. దీనినిబట్టి జనాభా పెరుగుదలను అదుపులో పెట్టవలసిన ఆవశ్యకత యెట్టిదో స్పష్టమౌతున్నది. కేవలం జనాభా పెరుగుదల దృష్ట్యానేగాకుండా తల్లుల, పిల్లల ఆరోగ్యం దృష్ట్యాకూడా కుటుంబనియంత్రణం(కుటుంబములను పరిమితం చేయడం) చాలా అవసరం. అందువల్లనే ప్రజా

రోగ్య కార్యక్రమాలలో కుటుంబ నియంత్రణమునకు ముఖ్యమైన స్థాన మివ్వబడింది.

తొలి ప్రణాళిక కాలంలో ప్రజాభిప్రాయమును కుటుంబనియంత్రణపద్ధతిపట్ల సుముఖం చేయడానికి కొంతకృషి జరిగింది. అవసరమైన వారికి సలహాలను, సహాయమును యిచ్చేనిమిత్తం పెక్కుచోట్ల ఫామిలీ ప్లానింగ్ క్లినిక్‌లు యేర్పాటు చేయబడినాయి. వీనిలో కుటుంబనియంత్రణమునకు సంబంధించిన పరిశోధనలుకూడా జరుపబడుతున్నాయి.

కుటుంబనియంత్రణ పద్ధతిపట్ల ప్రజాభిప్రాయం చాలవరకు సుముఖమై, ఈ విషయంలో కొంతకృషి జరిగింది గాబట్టి ఇక ముందు ఈ కార్యక్రమమును విస్తృతముగా అమలు జరుపడం సాధ్యమేనని ప్రణాళికాసమితి భావిస్తున్నది. ఇందునిమిత్తం కేంద్ర సంఘమొకటి యేర్పాటు చేయబడాలని సిఫార్సు చేయబడింది. ఈ సంఘము దిగువ అంశములుగల కార్యక్రమమును రూపొందించి అమలు జరుపవలసియుంటుంది—

(1) కుటుంబజీవనము, లైంగికవిద్య, వివాహితులకు తగిన సలహాల నివ్వడం, బిడ్డల పెంపకం మొదలగు ముఖ్య విషయాలుగల విస్తృతమైన పథకమును రూపొందించుట;

(2) కుటుంబనియంత్రణం విషయమై తగిన సలహాలను, పరికరములను యివ్వడానికి మరిన్ని "ఫామిలీ ప్లానింగ్ క్లినిక్"లను యేర్పాటు చేయుట;

(3) జనాభాపెరుగుదలతీరు, కుటుంబ నియంత్రణమునకు సంబంధించిన తదితర ముఖ్యవిషయములందు పరిశోధనలను జరిపించుట;

(4) ప్రభుత్వ సహాయం పొందుతూ, ఈ విషయంలో కృషి చేస్తూవున్న సంస్థల పర్యవేక్షణ; జరిగిన కృషిని సమీక్షించుట;

(5) కుటుంబనియంత్రణ కార్యక్రమాల నిర్వహణకు అవసరమైన సిబ్బందికి తర్ఫీదు సౌకర్యాలను యేర్పాటు చేయుట; మొదలగునవి.

రెండవ ప్రణాళికలో కుటుంబనియంత్రణ కార్యక్రమము నిమిత్తం రూ. 5 కోట్లు ప్రత్యేకించబడింది. ఈ మొత్తముతో పట్టణ ప్రాంతాలందు 300, గ్రామీణ ప్రాంతాలందు 2,000 "ఫామిలీ ప్లానింగ్ క్లినిక్"లు నెలకొల్పబడగలవు.

# 12. గృహవసతి

ప్ర: మనదేశంలో పట్టణప్రాంతములందు గృహవసతి కొరత మిక్కుటముగా నున్నది. దీనికి కారణమేమిటి? రెండవ ప్రణాళిక పూర్తియగుసరికి ఈ పరిస్థితి కొంతవరకైనా మెరుగయ్యే అవకాశ మున్నదా?

ఉ: గత 30 సం. లుగా దేశజనాభా త్వరితగతిన పెరుగుతూ వచ్చినందువల్ల నేమి, గ్రామీణప్రాంతములలో నివసించేవారిలో అనేక మంది పనిపాటుల నిమిత్తం పట్టణప్రాంతాలకు వలస వెళ్లడం వల్ల నేమి పట్టణప్రాంతాలలో గృహవసతి కొరత యెక్కువౌతూ వచ్చింది. ముఖ్యంగా గతయుద్ధము రోజులలో ఈ పరిస్థితి మిక్కుట మైంది. గృహనిర్మాణం తగినంతగా జరగకపోవడంకూడా దీనికిగల కారణాలలో ఒకటి. పైగా దేశవిభజన ఫలితంగా పంజాబ్, బెంగాల్ రాష్ట్రాలందు ఇండ్లకొరత మరీ మిక్కుటమైంది.

1951 సం. లో పట్టణములందు నివసించేవారి జనాభా 6.2 కోట్లు కాగా, గృహములసంఖ్య దాదాపు 100 లక్షలుగా నున్నది. అప్పటికి ఇండ్లకొరత 25 లక్షలవరకు వుండవచ్చునని అంచనా వేయ బడింది. పోతే 1961 సం. నాటికి పట్టణముల జనాభా 1951 సం. పు జనాభాకంటె కనీసం 33 శాతమైనా పెరిగియుండగలదని ఆశించ బడుచున్నది. అప్పటికి ఇండ్లకొరత 1951 సం. తో పోల్చితే

కనీసం రెట్టింపైనా వుంటుంది. ఈ కొరతను సాధ్యమైనంతవరకు తగ్గించే నిమిత్తం తొలిప్రణాళిక కాలంలో ప్రభుత్వ, ప్రయివేటు రంగములు గృహనిర్మాణ పథకము లనేకం (వీనిలో కార్మికుల గృహవసతి పథకములు కూడా చేరివున్నాయి) చేపట్టి పూర్తి చేశాయి. రెండవ ప్రణాళిక కాలంలో కూడా ఇట్టిపథకములు అనేకం చేపట్టబడనున్నాయి. ఏదియేమైనా పట్టణప్రాంతాలందు గృహవసతి కొరత పూర్తిగా తగ్గడానికి మరికొన్ని సం. లు పట్టవచ్చును.

ప్ర: రెండవ ప్రణాళికలో గృహనిర్మాణం నిమిత్తము ఖర్చు పెట్టబడనున్న మొత్తమెంత? మొత్తమెన్ని గృహములు నిర్మించబడ నున్నాయి?

ఉ: ప్రణాళికలో గృహనిర్మాణము నిమిత్తం రూ. 120 కోట్లు కేటాయించడమైనది. ఈ మొత్తము దిగువ విభజించబడినట్లు ఖర్చు పెట్టబడనున్నది.

| అంశము | ఖర్చు (రూ. కోట్లలో) | లక్ష్యము (గృహముల సంఖ్య) |
|---|---|---|
| పారిశ్రామిక గృహనిర్మాణము | 45 | 1,28,000 |
| తక్కువ ఆదాయపు వర్గము గృహ వసతి | 40 | 68,000 |
| గ్రామీణ ప్రాంతాలందు గృహ వసతి | 10 | — |
| మురికిపేటల తొలగింపు, ఊడ్చే వారి గృహవసతి | 20 | 1,10,000 |

| | | |
|---|---|---|
| మధ్య తరగతి వర్గము గృహ వసతి | 3 | 5,000 |
| తోట పనివారలకు గృహవసతి | 2 | 11,000 |
| మొత్తం | 120 | 3,22,000 |

పైన వివరించబడిన పథకములందు కొన్ని తొలి ప్రణాళిక కాలంలోనే చేపట్టబడినాయి. గ్రామీణ ప్రాంతాలందు గృహవసతి విషయంలో క్రొత్తవాని నిర్మాణముకన్న, వున్నవానిని బాగుచేయ డానికే యెక్కువగా కృషి జరుగుతుంది. అందువల్లనే పైపట్టికలో ఈ విషయమునకు సంబంధించిన లక్ష్యము యివ్వబడలేదు.

పైవానితోబాటు కేంద్ర మంత్రిత్వ శాఖలు, రాష్ట్ర ప్రభుత్వాలు, స్థానిక సంఘాలుకూడా గృహ నిర్మాణ కార్యక్రమములను చేపట్టనున్నాయి. ఇవన్నీ కలిసి, 7,53,000 వరకు గృహములను నిర్మించగలవు. పోతే ప్రయివేటు రంగములో కనీసం 8,00,000 గృహములు నిర్మించబడవచ్చును. ఈ విధముగా రెండవ ప్రణాళిక కాలంలో మొత్తంమీద దాదాపు 19 లక్షల గృహములు నిర్మించబడ గలవని ఆశించబడుచున్నది.

**ప్ర : గ్రామీణ ప్రాంతాలందున్న గృహవసతి పరిస్థితులను బాగు చేయడానికి తీసికొనబడుతున్న చర్యలేమిటి ?**

ఉ : దేశంలో గ్రామీణ ప్రాంతాలందున్న దాదాపు 5.4 కోట్ల గృహములందు అధికభాగం పరిస్థితి యేమాత్రమూ సంతృప్తి కరముగాలేదు. వీనిని తిరిగి నిర్మించడమో, లేకపోతే చాలవరకు బాగుచేయడమో జరుగవలసి యున్నది. ముఖ్యంగా పేదప్రజల గృహ

వసతి విషయమై వెంటనే శ్రద్ధ వహించడం యెంతైనా అవసరం. గ్రామీణ ప్రాంతాలందు గృహనిర్మాణ కార్యక్రమం యెక్కువగా స్వయం సహాయ సూత్రంమీదనే ఆధారపడి నిర్వహించబడాలని ప్రభుత్వ సంకల్పం. అవసరమైన సాంకేతిక సహాయమును అందజేయడం, స్థానిక పరిస్థితులకు అనుగుణమైన డిజైనులను తయారుచేసి ఇవ్వడం, అప్పుడప్పుడు గృహనిర్మాణ ప్రదర్శనలను యేర్పాటు చేయడం, మొదలగు పనులద్వారా ప్రభుత్వం సహాయపడుతుంది. వెనుకబడిన తరగతులవారు, భూములులేని వ్యవసాయకూలీలు, సహకార సంఘములను ఏర్పాటుచేసికొంటే, గృహనిర్మాణమునకవసరమైన ఆర్థిక, సాంకేతిక సహాయములను, ఉచితంగా ఇళ్ళస్థలములను ప్రభుత్వం మంజూరుచేస్తుంది.

గ్రామీణప్రాంతాలందు గృహనిర్మాణ కార్యక్రమమును నిర్వహించుటలో రాష్ట్రప్రభుత్వాల అభివృద్ధి శాఖలతోబాటు, జాతీయ విస్తరణ కార్యక్రమ నిర్వహణశాఖకూడా సహాయపడుతుంది. దేశమందలి వివిధప్రాంతాలకు అనుగుణమైన డిజైన్లను, గృహనిర్మాణ పద్ధతులను రూపొందించే నిమిత్తం కేంద్రప్రభుత్వం పనులు, గృహనిర్మాణం, సప్లైల మంత్రిత్వశాఖలో గ్రామీణ గృహనిర్మాణవిభాగం ఒకటి యేర్పాటు చేయబడింది.

ప్ర : ప్రణాళికలో మురికిపేటల తొలగింపుకు, ఊడ్చేవారికి గృహవసతిని కల్పించడానికి రూపొందించబడిన కార్యక్రమంలోని ముఖ్యాంశములేమి ?

ఉ : మేలైన గృహవసతి నిర్మాణమునకు రూపొందించబడిన కార్యక్రమంలో మురికిపేటల తొలగింపు ముఖ్యభాగమై యున్నది.

ఒకప్రక్క మంచిగృహాములు నిర్మించబడుతూ, మరొకప్రక్క మురికి పేటలను యథాతథంగానుంచడం భావ్యంకాదని ప్రత్యేకించి చెప్ప నవసరంలేదు. మన పెద్ద పెద్ద పట్టణాలన్నింటిలోనూ మురికిపేటలు యెక్కువగా వున్నాయి. మురికిపేటలను స్వాధీనం చేసికొనడానికి వ్యయం అధికమైనందువల్లనేమి, వానిలో నివసించే పేదప్రజానీకం యెక్కువఅద్దె చెల్లించవలసివస్తుందనే భయంచేత ఇతరచోట్లకు తరలి పోవడానికి యిష్టపడనందువల్లనేమి, తదితర కారణాలవల్లనేమి ఇటీ వలివరకూ మురికిపేటల తొలగింపువిషయంలో అంతగా కృషి జరుగ లేదు. రెండవప్రణాళికలో దీనినిమిత్తం రూపొందించబడిన క్రొత్త పథకములో ఈ ముఖ్యవిషయాలన్నీ దృష్టిలోకి తీసికొనబడినాయి.

రాజ్యాంగమును సవరించుటద్వారా ప్రభుత్వం మురికిపేటలను స్వాధీనం చేసికొనేందుకు అవసరమైన హక్కునుపొందింది. వీనిలో నివసించేవారికి వారు పనిచేసేచోట్లకు సమీపంలోనే శుభ్రమైన గృహావసతి చూపించబడగలదు. అద్దెలను సాధ్యమైనంత తక్కువ స్థాయిలో నుంచేనిమిత్తం, కట్టడాలు విపులమైనవిగాకుండా, శుభ్ర మైనవై ముఖ్యమైన సౌకర్యాలను కలిగియుండాలని నిర్దేశింపబడింది.

రాష్ట్రప్రభుత్వాలు మురికిపేటల తొలగింపుకు పెట్టేఖర్చులో 25 శాతము సబ్సిడీగాను, 50 శాతము దీర్ఘకాలఋణములుగానూ కేంద్రప్రభుత్వం సమకూర్చాలని ప్రణాళికాసమితి సిఫార్సుచేసింది.

మురికిపేటలందు నివసించేవారిలో అధికసంఖ్యాకులు ఊడ్చే వారే. కాబట్టి రెండవ ప్రణాళికకాలంలో వీరిలో పెక్కుమందికి తగిన గృహావసతి లభించగలదని ఆశించవచ్చును.

# 13. కార్మికులు, కార్మిక సంక్షేమం

ప్ర : పారిశ్రామిక కార్మికుల విషయంలో ప్రభుత్వ విధానం యెట్టిది ?

ఉ : "తృప్తిపడినవాడే కష్టపడి పనిచేయగలడు"— మనదేశం స్వతంత్రమైనప్పటినుండీ ప్రభుత్వం కార్మికులవిషయంలో అనుసరిస్తున్న విధానానికి ఈ సూత్రమే ప్రాతిపదిక. దీనికి అనుగుణముగా, కార్మికుల జీవన పరిస్థితులను అభివృద్ధి చేయడానికి అనేక చర్యలు తీసికొనబడ్డాయి. సరసమైన సర్వీసునిబంధనలు, వేతనములు, సాంఘికభద్రత, మేలైన గృహావసతి, తర్ఫీదు సౌకర్యాలు మొదలగువాని పట్ల తగిన శ్రద్ధ తీసికొనబడుచున్నది. పరిశ్రమల యజమానులకు, కార్మికులకు మధ్య వివాదాలను సాధ్యమైనంతవరకు నివారించడానికి, ఒకవేళ వివాదాలు వస్తే, ఇరుపక్షాలకు న్యాయం చేకూరునట్లు పరిష్కరించడానికి కృషి జరుగుతున్నది.

ప్రణాళికా సమితి ప్రభుత్వ కార్మికవిధానమును ఆమోదిస్తూ, ప్రతి కార్మికుడూ సోషలిస్టు సామాజిక వ్యవస్థలో తనకుగల బాధ్యతలను గుర్తెరిగి అందుకు అనుగుణ్యముగా కృషి చేయాలని ఉద్బోధించింది. వ్యవసాయ కార్మికులు, కాంట్రాక్టు కార్మికులు, స్త్రీ కార్మికుల సమస్యలు ప్రత్యేకమైనవిగాబట్టి వారికి ప్రత్యేక సౌకర్యాలను కల్పించడం అవసరమనికూడా ప్రణాళికా సమితి సిఫార్సు చేసింది.

ప్ర: ప్రణాళికలో కార్మికుల సంక్షేమం నిమిత్తము రూ. 29 కోట్లు ప్రత్యేకించబడింది. ఈ మొత్తం యే పథకముల నిమిత్తం ఖర్చు పెట్టబడనున్నది?

ఉ: ప్రణాళికలో కార్మికుల సంక్షేమం నిమిత్తం కేంద్ర ప్రభుత్వము రూ. 18 కోట్లు, రాష్ట్రప్రభుత్వాలు రూ. 11 కోట్లు ఖర్చుపెట్టనున్నాయి. ఈ కార్యక్రమమందలి ముఖ్యాంశములు దిగువ వివరించబడ్డాయి:

1. చేతిపనివారల తర్ఫీదు పథకము క్రింద, క్రొత్తగా 20,000 సీట్లు యేర్పాటుచేయబడనున్నాయి. ప్రత్యేక నైపుణ్యం గల చేతిపనివారల తర్ఫీదు నిమిత్తం "అప్రెంటిస్" పథకము ఒకటి రూపొందించబడింది. పోతే బోధకుల తర్ఫీదు నిమిత్తం మరొక సంస్థ యేర్పాటు చేయబడనున్నది.

2. కార్మికులకు మరిన్నిసదుపాయములుకల్పించే ఉద్దేశ్యంతో, కార్మికుల భీమా పథకము, ప్రావిడెంటుఫండు పథకములందు కొన్ని మార్పులు చేయబడనున్నాయి.

3. ఎంప్లాయిమెంటు సర్వీసు సంస్థను విస్తరింప జేయుటతో పాటు, యువకుల నిమిత్తం ప్రత్యేకంగా ఎంప్లాయిమెంటు సర్వీసు ఒకటి యేర్పాటు చేయబడనున్నది. ఉద్యోగాలకు ప్రయత్నించేవారికి అవసరమైన సలహాల నివ్వడానికి ఎంప్లాయిమెంటు ఎక్సేంజీలందే తగిన యేర్పాట్లు చేయబడుతాయి. ఎంప్లాయిమెంటు ఎక్సేంజీలు, ఆ యా మంత్రిత్వశాఖల సహాకారంతో "ట్రేడ్ టెస్ట్"లను యేర్పాటు చేస్తాయి.

4. కేంద్ర కార్మికసంస్థ విస్తరింపజేయబడనున్నది. కార్మికులకు వినోదంతో బాటు, విజ్ఞానమును కూడా ఇవ్వగల ఫిలుములను తయారుచేసేందుకు ఒక చిన్న ఫిల్మ్ యూనిట్ యేర్పాటుచేయబడనున్నది. కార్మికుల గృహవసతి, వారి బిడ్డలకు విద్యాసౌకర్యాల కల్పన మొదలగు పథకములు కూడా చేపట్టబడగలవు.

# 14. వెనుకబడినవర్గాల సంక్షేమం

ప్ర : వెనుకబడినవర్గాల సముద్ధరణకొరకు ప్రణాళికలో కేటాయించబడిన మొత్తమెంత ?

ఉ : వెనుకబడినవర్గాల సాంఘిక, ఆర్థికపరిస్థితులను బాగుచేసే నిమిత్తం ప్రణాళికలో ప్రత్యేక కార్యక్రమాలు చేర్చబడినాయి. ఈ కార్యక్రమాలన్నింటికీ కలిపి మొత్తం రూ. 91 కోట్లు కేటాయించబడింది. ఈ మొత్తములో రూ. 47 కోట్లు షెడ్యూల్డ్ జాతుల (ఆదిమ జాతులు) నిమిత్తం, రూ. 27.5 కోట్లు షెడ్యూల్డ్ కులాల నిమిత్తం, రూ. 3.9 కోట్లు మాజీ నేరస్థజాతుల నిమిత్తం, రూ. 9.7 కోట్లు ఇతర వెనుకబడిన వర్గముల నిమిత్తం, రూ. 2.9 కోట్లు వివిధ కార్యక్రమాల నిర్వహణకు ఖర్చుపెట్టబడనున్నవి.

ప్ర : వెనుకబడినవర్గాలను యెదుర్కొనే ప్రత్యేక సమస్యలు యెట్టివి ? వారి అవసరాలను తీర్చడానికి ప్రభుత్వంచేస్తున్న కృషియెట్టిది ?

ఉ : వెనుకబడినవర్గాలను యెదుర్కొనే సమస్యలన్నింటికీ ముఖ్య కారణం, చదువుసంధ్యలు లేకపోవడమే. అందువల్లనే వీరి అభివృద్ధి నిమిత్తం రూపొందించబడిన కార్యక్రమాలన్నింటిలోనూ విద్యా సౌకర్యాలకు ప్రత్యేకప్రాధాన్యమివ్వబడింది. ఉచితముగా ప్రాథమిక విద్యాసౌకర్యాలను యేర్పాటుచేయడం; వెనుకబడినవారిలో

తెలివిగల విద్యార్థులకు స్కాలర్‌షిప్పులను, ఉచిత విద్యార్థి వేతనములను యిచ్చి ప్రోత్సహించడం; పుస్తకాలను కొనుక్కోడానికి, పరీక్ష రుసుములను చెల్లించడానికి గ్రాంటులివ్వడం; ఉచితంగా భోజనసౌకర్యాలను యేర్పాటుచేయడం; వివిధవృత్తులందు, సాంకేతిక విషయములందు తర్ఫీదుపొందగోరేవారికి స్టయిపండులనివ్వడం, మొదలగు చర్యలద్వారా వెనుకబడిన వర్గాలలో విద్యాభివృద్ధికి కృషి జరుపబడుతున్నది. వెనుకబడిన వర్గాల నిమిత్తం 6,000 పాఠశాలలను, హాస్టళ్లను ప్రారంభించడానికీ; 30 లక్షల ఉచిత విద్యార్థివేతనాలనివ్వడానికి ప్రణాళికలో తగిన యేర్పాట్లున్నాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వముల పరిపాలనా శాఖలందు వెనుకబడిన వర్గాల నిమిత్తం పెక్కు ఉద్యోగాలు ప్రత్యేకించబడినాయి.

ఇదివరలో షెడ్యూల్డుకులాలు అస్పృశ్యతవంటి దురాచారములవల్ల అనేకరకాల బాధలకు లోనైనారు. 1955 జూన్ నుండి అస్పృశ్యత శిక్షింపదగిన నేరముగా ప్రకటించబడింది. మన రాజ్యాంగములో ఈవిషయం స్పష్టముగా నిర్దేశింపబడింది. షెడ్యూల్డ్ కులాలకు గృహావసతి, మంచినీటి సరఫరా, తగిన పనిపాటులను కల్పించే నిమిత్తం కేంద్రప్రభుత్వం కొన్ని ప్రత్యేక పథకములను ప్రారంభించింది. రాష్ట్ర ప్రభుత్వాలుకూడ వీరి పరిస్థితులను బాగుచేయడానికి కొన్ని కార్యక్రమాలను రూపొందించాయి.

ఇక ఆదిమజాతుల విషయం. వీరికి ప్రత్యేకమైన సంప్రదాయములున్నాయి. వీరి సంస్కృతి పురాతనమైనది. వీరి సముద్ధరణకు రూపొందించబడే యేకార్యక్రమైనా ఈముఖ్య విషయాలను దృష్టిలోకి తీసికొనడం అవసరం. లేకపోతే వీరికి లేనిపోని అనుమానాలు కలిగి, అసలు ఈ కార్యక్రమాలకే భంగమువాటిల్లే ప్రమాదమున్నది.

ఆదిమ జాతుల అభివృద్ధి కార్యక్రమములను నాల్గు తరగతుల క్రింద విభజించవచ్చును. అవి రవాణా, వార్తాసౌకర్యాల అభివృద్ధి; విద్యా సాంస్కృతిక సౌకర్యాల కల్పన; ఆదిమజాతుల ఆర్థికవ్యవస్థను బాగు చేయుట; ఆరోగ్యం, గృహవసతి, మంచినీటి సరఫరా సౌకర్యాల కల్పనకు సంబంధించినవి. ఆదిమజాతిప్రాంతాలందు సహకారసంఘా లను యేర్పాటు చేయడానికి కూడా కృషి జరుగుతున్నది.

పోతే మాజీ నేరస్థజాతుల విషయం. వీరు సంచారజీవనమును మాని, తగిన చోట్ల స్థిరపడి, గౌరవంగా బ్రతుకునట్లు తగిన తర్ఫీదు నివ్వడానికి కృషి జరుగుతున్నది. వీరి పిల్లలను దురలవాట్ల నుండి తప్పించి, విద్యాబుద్ధులను గరపడానికి కూడా తగు యేర్పాట్లు చేయబడుతున్నాయి.

## 15. సాంఘికసంక్షేమం, నిర్వాసులపునరుద్ధరణ

ప్ర : సాంఘికసంక్షేమ రంగములో నిర్వహించబడుచున్న ప్రధాన కార్యకలాపాలేమిటి ?

ఉ : దేశంలో ఐచ్ఛికంగా సాంఘికసంక్షేమ కార్యక్రమాలను నిర్వహించే సంస్థలు అనేకంవున్నాయి. ఈకార్యక్రమములను పర్యవేక్షించుటతోబాటు, ఈసంస్థలకు అవసరమైన సహాయసహకారముల నిచ్చేందుకు తొలిప్రణాళిక కాలంలోనే కేంద్రసాంఘిక సంక్షేమ సంఘము నెలకొల్పబడింది. ఈసంఘము ఐచ్ఛికసంస్థలకు సహాయము నిచ్చుటతోబాటు, గ్రామీణప్రాంతాలందు పేదస్త్రీలు, పిల్లల సహాయార్థం సంక్షేమవిస్తరణ పథకమును రూపొందించింది. ఈపథకము క్రింద ప్రస్తుతం జిల్లాకొక సంక్షేమవిస్తరణ కేంద్రము పనిచేస్తున్నది.

రెండవ ప్రణాళికకాలంలో ఇట్టి కేంద్రాలు జిల్లాకు నాలుగు చొప్పున కేటాయించబడాలని సంకల్పించబడింది. ప్రణాళిక ముగియు నప్పటికి దేశంలో యిట్టికేంద్రాలు 1320 కి పెరిగి, 50,000 గ్రామాలు వీనిద్వారా సహాయమును పొందుతూ వుండగలవు. కేంద్రసాంఘిక సంక్షేమసంఘము చేపట్టిన ముఖ్యపథకములందు మరియొకటి కుటుంబసంక్షేమ పథకము. ఈ పథకముక్రింద తక్కువ ఆదాయములుగల మధ్యతరగతి కుటుంబములందలి స్త్రీలకు తీరిక సమయములందు తగిన పనులివ్వబడుతాయి. ఈ పనులను వారు

ఇండ్లలోనేవుండి చేయవచ్చును. ఈవిధంగా మధ్యతరగతి కుటుంబము లందలి స్త్రీలుకూడా పనిచేసి, ఆదాయములను వృద్ధిచేసికొనవచ్చును. నైతికంగా పతనమొందిన స్త్రీలు, బాలబాలికలనిమిత్తం కూడ కేంద్ర సాంఘిక సంక్షేమసంఘము శరణాలయములను నిర్వహిస్తున్నది.

కేంద్ర విద్యామంత్రిత్వశాఖ కూడా కొన్ని సంక్షేమ కార్య క్రమాలను నిర్వహిస్తున్నది. యువజన సంక్షేమ కార్యక్రమం, జాతీయ క్రమశిక్షణ పథకము మొదలగునవి ఈ కార్యక్రమము లందు ముఖ్యమైనవి. ఈ మధ్యనే గ్వాలియర్ వద్ద జాతీయవ్యాయామ కళాశాల ఒకటి ప్రారంభించబడింది. యువజన సంక్షేమ కార్యకలాప ములను నిర్వహించే అనధికార సంస్థలకు కేంద్ర విద్యా మంత్రిత్వ శాఖ గ్రాంటుల నిస్తుంది. శారీరికంగాను, మానసికంగాను అశక్తు లైనవారికి విద్యాబుద్ధులను గరపి, తగిన తర్ఫీదునిచ్చి, ఉద్యోగావ కాశములను చూపించడానికికూడా కేంద్ర మంత్రిత్వశాఖ కృషి చేస్తున్నది.

కేంద్రప్రభుత్వం నిర్వహించే ఇతర సంక్షేమ కార్యక్రమా లందు ముఖ్యమైనవి, బాలనేరస్థులకు తగిన పాఠశాలలను నిర్వహించి, వారిని సత్ప్రవర్తనులను చేయడం, ఖైదులందు సంక్షేమ సౌకర్యా లను కల్పించడం మొదలగువానికి సంబంధించినవి.

ఇంతవరకు మద్యనిషేధము అమలుజరుపని రాష్ట్రాలు దశల వారీగా ఈ సంస్కరణను అమలుజరిపే నిమిత్తం కార్యక్రమాలను రూపొందించాలని విజ్ఞప్తి చేయబడింది. మన రాజ్యాంగమునందు

నిర్దేశింపబడిన మద్యనిషేధ విధానం సాధ్యమైనంత త్వరలో దేశమంతా అమలుజరగాలని ప్రభుత్వం సంకల్పిస్తున్నది.

ప్ర : నిర్వాసుల పునరుద్ధరణ విషయంలో జరిగినకృషి జరగ్గా, మిగిలిన ముఖ్యకర్తవ్యాలేమిటి ? ఇవి యేవిధంగా పూర్తిచేయబడనున్నాయి ?

ఉ : పశ్చిమ పాకిస్తాన్‌నుండి వలసవచ్చిన నిర్వాసుల పునరుద్ధరణ కార్యక్రమం దాదాపు పూర్తియైనట్లే. ఇక రెండవ ప్రణాళిక కాలంలో, వీరినిమిత్తం యిదివరకే ఆమోదించబడిన గృహనిర్మాణ పథకములను పూర్తిచేయుటతోపాటు, ఇతోధికముగా తర్ఫీదు విద్యాసౌకర్యాలను కల్పించవలసియున్నది. నిర్వాసులవసతి వాడలలో మరిన్ని పరిశ్రమలను నెలకొల్పి, తద్వారా నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికి కృషి జరుగుతున్నది. నష్టపరిహారపు చెల్లింపు పథకముకూడా చురుకుగా అమలు జరుగుతున్నది.

పోతే, తూర్పు పాకిస్థాన్‌నుండి తెంపులేకుండా వస్తున్న నిర్వాసులకు తూర్పురాష్ట్రాలందే స్థిరనివాసమును కల్పించవలసియున్నది. ఇది క్లిష్టమైన సమస్య. అయినా వీరిలో వ్యవసాయం చేసేవారికి ప॥ బెంగాల్ మినహా మిగతా తూర్పురాష్ట్రాలందు స్థిరనివాసం కల్పించేందుకు కృషి జరుగుతున్నది.

ఈలోగా వీరికి వైద్య, విద్యా సౌకర్యాలు యేర్పాటు చేయబడుతున్నాయి. వ్యాపారంలో స్థిరపడదలచినవారికి, గృహములను నిర్మించుకొనే ఉద్దేశ్యంగలవారికి ఋణములు యివ్వబడుతున్నాయి. క్రొత్తగా వెలసిన వసతివాడలందు పరిశ్రమలు యేర్పాటు

చేయబడుతున్నాయి. ఈ పరిశ్రమలందు అనేకమందికి పనిపాటులు లభించగలవు. నిర్వాసులను స్వీకరించే రాష్ట్రాలన్నీ, రాష్ట్ర అభివృద్ధి కార్యక్రమాలను పునరుద్ధరణ కార్యక్రమమును సమన్వయపరచి అమలు జరుపుతున్నాయి. ఈ పద్ధతివల్ల నిర్వాసుల పునరుద్ధరణ కార్యక్రమాలు సులభతరం కాగలవనుటకు సందేహంలేదు.

# మరికొన్ని తెలుగు ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 1. ఎస్టేటు డ్యూటీ — సామాన్యులకు | వెల. | రు. 1.50 న. పై. | |
| 2. దశాంశ నాణెములు | ,, | 25 | ,, |
| 3. అస్పృశ్యతా నివారణ (రేడియో ప్రసంగములు) | ,, | 25 | ,, |
| 4. ప్రాతిపదికవిద్య (ప్రశ్నోత్తరములు) | ,, | 20 | ,, |
| 5. మద్యనిషేధము (ప్రశ్నోత్తరములు) | ,, | 15 | ,, |
| 6. జాతీయ పంచాంగము | ,, | 20 | ,, |
| 7. గౌతమబుద్ధ | ,, | 5 | ,, |
| 8. మెట్రిక్ పద్ధతి : తూనికలు, కొలతలు | ,, | 35 | ,, |
| 9. పురోభివృద్ధికి ప్రణాళికలు | ,, | 75 | ,, |
| 10. దేశదేశాల జానపదకథలు | ,, | 75 | ,, |
| 11. భారతదేశపు జానపదకథలు | ,, | రు. 1 | |

పోస్టేజి ప్రత్యేకం.

*ప్రతులకు దిగువ చిరునామాకు వ్రాయాలి :*

బిజినెస్ మేనేజర్

పబ్లికేషన్స్ డివిజన్,

ఓల్డ్ సెక్రటేరియట్, ఢిల్లీ - 8

---

*అజంతా ప్రింటర్సు, మహాకాళీ స్ట్రీట్, సికింద్రాబాదు.*

